KAALA VAHINI (The Stream of Time)

(A Book of Poems in Telugu)

*By* Dr. B. Gopala Reddi



మొదటి ముద్రణ : మే, 1979



వెల : ఆరువందల పైసలు

ప్రతులకు :

ఆంధ్ర సారస్వత పరిషత్

4-3-550/2 బొగ్గుల్‌కుంట

హైదరాబాద్-500 001.

ముఖచిత్ర లేఖనం :

గంగాధర్

ముద్రణ :

క్రాంతి ప్రెస్,

మద్రాసు-600 00 .

# అం తం

ఆత్మీయులు

నా మీద శ్రద్ధాభిమానములు చూపినవారు,
నాతో కూడ సత్యాగ్రహ సమరములో పాల్గొని
జైలులో నున్నవారు

ర్తి శేషులు

## శ్రీ బెజవాడ వేంకటకృష్ణారెడ్డి

- - ——— - -

## శ్రీ బెజవాడ శివకోటారెడ్డి

ఆగస్టు ———

గార్ల స్మృతికి

# కాలవాహిని

## విన్నపము

సొంత కవితలు రాయడానికి పూనడం 1977 సం॥ మే మాసము నుండే. అంతకు ముందు స్వీయ రచనలు చేయలేదు. అనువాదాలతోనే అందులోను రవీంద్రుని బెంగాలినుండి, ఇక్‌బాల్ ఉర్దూనుండి మాత్రము · యగలిగాను. సొంత కవితలు రాయడానికి శక్తి చాలదేమోయని తల· వాడిని. అందువల్ల అట్టి సంకల్పముకూడా లేకుండింది.

తాజ్‌మహల్ జన్మకారణము నా కల్పనను ఆకర్షించింది. వియోగపు విష ·రాలలో ఈ సౌందర్య కమలము పుట్టింది. దాదాపు పదిహేను సంవత్సరాలకు పైగా తాజ్‌మహల్‌పై వ్యాసమో, నాటికో రాయాలని కోరిక వుండేది. వచ్చిన భావాలను కొ ్ వాకా లలో కూర్చి రాసుకొన్నాను. ఆ కాగితాలుపోయి చాల కాలమైంది. కోరిక తలపు అల్లా، వుండిపోయింది. చిగుళ్ళు వేయక، తలపు మొక్క ఎండి పోయింద· తలచాను. మే మాసపు విశ్రాంతిలో ఎండల వడగాడ్పులకు ఆ భావ జములో సంచలము కాన్పించింది. ఎండలకే అది పొటమరించింది. ఎండల పొది లో، నా తొలి కవిత పుట్టింది. నియమాలు లేని గద్యకవిత్వమే నాకు శరణ్యము. గణాలు మాత్రము నన్ను ఎప్పుడు అకర్షింప· దు. గద్యకవిత ప్రచారములో వుంది. వలము తెలుగులో కాదు. అన్ని ప్రాంతాలలో వుంది. అన్ని భాషలలో వుంది. ఆదరణ పొందుతుంది. సంపూర్ణస్వేచ్ఛతో కూడింది. ను ప్రయత్నించగలిగింది అదే.

రాయాలని కోరిక వుండేది. కాని రాయలేకపోయాను. దాన్ని ఈ వరుసలోనే రాయడం జరిగింది। ఇందు పరోక్షరాజ యాల గూర్చి ఐదు ్షికలున్నాయి. అందు ముఖ మైనది జనవరి 26. రిపబ్లిక్ దినానికి వెనుక ఎన్ని ఆకాంక్షలు, యత్నాలు, తపస్సు త్యాగము వున్నాయో చిత్రింపకోరినాను. అది వీరగాథ, త్యాగగాథ. మనకు పవిత్రమైన దినము. 'అంబేద్కరు'లో అస్పృశ్యతా నిరూ లన కావాలని హరిజనుల ఆశావాణిగా అం· ద్కరు హిందూ సంఘాన్ని ప్రతిఘటించి ప్రచారము సల్పినాడని పేర్కొన్నాను. మే స్మృతులలో టాగూరు జన్మించిన మాసమని, నెహ్రూ చనిపోయిన మాసమని పేర్కొంటూ నా సొంత విషయాలు కొన్ని ఉల్లేఖించినాను.

నా కవితల తొలుత వినిపించింది శ్రీ వెంకటేశ్వర విశ్వవిదా లయంలో కులపతి సచ్చిదానందమూర్తి అధ్యక్షతలో. దాని- నా రంగ ప్రవేశమన్నాను. తర్వాత ఇంచు మించు అన్ని విశ్వవిద్యాలయల్లోను చదివి వినిపించాను. చాలమంది స్నేహితుల యిండ్లలో పఠనము చేశాను. జస్టిస్ ఆవుల సాంబశివరావుగారు ఏర్పాటు సిన సభ పేర్కొనదగినది. పదిమందికి పైగ హైకోర్టు న్యాయమూర్తులు వి ్చశారు. సాహిత్య సభలో అంతమంది న్యాయమూర్తుల చూడడం అదే మొదటిసా మో. ఢిల్లీలోను చదివి వినిపించాను. దానితో కొంత ఆత్మవిశ్వాసము ఏర్పడింది.

ఈ లోపల ఆంధ్రప్రభ వారపత్రికలో కాలవాహినిలోని పెక్కు శీర్షికలు వెలువడ్డాయి. మిత్రులు విద్వాన్ విశ్వం, ఎల్లోరాలు ప్రచురించడములో శ్రద్ధవహించారు. సభల ఏర్పాటు సిన పెద్దలకు, ప్రచురించిన పెద్దలకు కృతజ్ఞత తెలుపుకొంటున్నాను.

తెలుగు సాహిత్య మర్యాదలు నాకు బాగా తెలియవు. అయినా నా రచనలపట్ల కొంత అభిమానాన్ని సంపాదించానని తృప్తి. ఆ నమ్మకముతో, పుస్తక రూపములో వెలువరిస్తున్నాను. చందూరు దంపతులు, బి.యస్.ఆర్. కృష్ణ సాయపడ్డారు. వారికి వందనాలు.

పాత మర్యాదలు సన్నగిల్లుచున్నాయి. క్రొత్త మార్గాలలో సాహిత్యము నడుస్తుంది. వచనయుగమిది. స్వేచ్ఛాయుగమిది. మన దేశములో దీనికి నాంది రవీంద్రుని ఇంగ్లీషు ,తాంజలి. అది వచనమే. దానికి నోబెల్ బహుమానం 1913 సం॥లో వచ్చింది. ఆయన ఇంగ్లీషు అనువాదల ్ల వచనమే. తర్వాత బెంగా ,లో అట్టి రచనలు

చేశారు. డు తెలుగులోకూడా బహుళ ప్రచారములో వున్నది ఈశై-. యువకులు ఈ శైలిలో, రాస్తున్నారు. గత ఇరువది సంవత్సరాలలో ఈశై- ముందుకు వచ్చింది.

ఇందు బాహ రూపాలు చమత్కారాలు వినోదాలు -వు. సంగీతము లేదు, లయకూడా లేద- చెప్పాలె. అట్టి నిరలంకారమైన శైలిలో కల్పనాభావనతో కూడిన కవిత్వము పుట్టించడం తేలికకాదు. వెదురు తునకను వేణువుగా ిర్చిదిద్ది మంజుల రాగ రాగిణులు పుట్టేంత శిల్పము కావాలి. సూటిగ చెప్పే శైలిలో కవితా జాలను నాటాలి. నా వలసినంత శక్తితో రాయడానికి ప్రయత్నించాను. ఏదైనా రసము వుంటే గ్రహించ డానికి సహృదయులు అంగీకరింతురుగాక.

రవీంద్రజయంతి దినము
8-5-1979
నెల్లూరు.

బెజవాడ గోపాల రెడ్డి

# తాజ్ మహల్

**తాజ్ మహల్**

ముంతాజ్ బేగం సమాధి
భార్యా విరహంతో కుములు
షాహజహాన్ కట్టించిన
చలువరాతి అందాల కట్టడం
శతాబ్దాలు గడచినా
కసుగందని యౌవనశోభ
తగ్గిపోని రూపలావణ్యం
వాడిపోని ప్రసూన సౌరభం.

## 2

శవాన్ని కప్పిన భవనం,
అజంతా గుహలకు
దక్షిణాది దేవళాలకు
లేనీ జనాకర్షణ.
విదేశయాత్రికుల సందర్శనం
విదేశధనం కోట్లు సంప్రాప్తి
భారతదేశంలో ఏమి చూడవలె?
కాశ్మీరులోని హిమగిరులు
ఆగ్రాలోని తాజ్ మహల్

అంతేనా, ఇంకేమీ లేవా?
ఉన్నవి, ఇంకా ఉన్నవి
అలవికాని పేదతనం
చెప్పరాని అంటరాని తనం
మూఢాచారాల అంధ విశ్వాసం
కులతత్వాల వైరితనం.

## 3

మహమ్మదీయుల *మక్బరా
సర్వమతస్థుల యాత్రా స్థలం
దేశంవచ్చిన స్త్రీ పురుషులందరు
తాజ్‌మహల్‌ని చూచే రవలె
తర్వాతనే ఢిల్లీ, జయపూర్
కా రపు లోయలు.
కళా సౌందర్యోపాసకులకు
తీర్థధామం. శిల్పసంగమం,
ప్రియావిరహులకు
ఊరట నిచ్చే చలువపందిరి
నాకూ ఒక తాజ్‌మహల్‌ని కట్టిస్తే
ఇప్పుడే చావడానికి సంసిద్ధం
అన్నది ఒక వైస్రాయి సతీమణి
ఎక్కడైనా స్వర్గమంటూ ఉంటే
ఇక్కడే ఇక్కడే అన్నారు ఒకరు
ప్రపంచ అద్భుతాల ఏడింటిలో
తాజ్‌మహల్ ఒకటని
విజ్ఞులు ప్రస్తుతించారు
దేశగౌరవానికే కీర్తి స్తంభం
దేశసౌందర్య సంపద మూలధనం.

---

* సమాధిపైన భవనము

అందాల గోపురం
గతించిన కాలకాలుష్యాన్ని
పారద్రోలే మల్లెల పెనుకొండ
దిగంతాల ఒంటిమీద
పూసిన తెల్ల చందనం
ఆకాశపు చంద్రవదన
తన అందాలకు మురిసే
భూలోకపు మణి దర్పణం
యమునా తిమిర నీరాలలో
ఉదయించిన పూర్ణచంద్ర హాసరేఖ
శ్రావణధారలచే కాళిందీ తరంగిణి
హిమగిరి శృంగముల భేదించి
కొనితెచ్చిన హిమ ఖండములు
ఆగ్రా విషాదవార్తను విని
స్తంభించి, ఘనీభూతమై
వెలసిన తుహిన సౌధము
శోకరాత్రి నిద్దురతెరపై
షాహజహాన్ గీచిన కలల చిత్తరవులు
అసువులపొంది దారి మరచి
నిలిచిపోయిన సౌందర్య స్వప్నాల పాంథశాల.
ద్వాపరమున వెన్నముద్దల ప్రుచ్చిలించి
ఋణపడిన గోపాలుడు, పశ్చాత్తాపపడి
వ్రజయువతులకు తిరిగి ఇచ్చిన
కలియుగ నవనీత గిరిరాజము;
ఆనాడు అప్పు తీయడానికి
ఈనాడు తీర్చడానికి
సాక్షులు, యమున గట్టుల
సైకత పులినములు,
యమునా జలోర్మికా చంచలాక్షులు
సౌరభమత్త సమీర కుమారులు.

## 5

కాలపు చెక్కిలిపై మెరసిన
కన్నీటి బొట్టు, తాజ్‌మహల్
అన్నాడు రవీంద్రుడు
చెమట ఊటల కార్చి
కూలీలు పండించిన
అందాల పంట
అన్నాడు అభ్యుదయ
ఒక ఉద్ధూకవి,
అశ్రుబిందువులు
స్వేద బిందువులు
సంగమించి
సౌందర్య ధారామృత బిందురాశిని
సృష్టించాయి
శుక్తి వర్షబిందువును
మౌక్తిక మొనర్చిన మాడ్కి.

-

వర్షా ని థ వేళల
పర్జన్య గర్జనభీతిచే
మేఘనాథుని చెరనుండి పారి
చంచలత్వమును వీడి
యమునా తీరముల
స్థిరనివాసమేర్పరుచుకొన్న
సురకన్య సౌదామినీ సౌధము.

## 7

పుట్టింది వియోగాగ్నిలో
అనలతప్త ప్రపూత
పెరిగింది యమునాజల సీమలలో

నదీజల స్నాత పరిశుద్ధ
యమునా తీరపు బృందావనం
గోపీజన ప్రణయేతి హాసం
యమునా తీరపు ఆగ్రాపురం
దుర్భరదారుణ వియోగ తి హాసం
ప్రణయగాథ ప్రసాదం భాగవతం
వియోగగాథ ప్రదత్తం చంద్రకాంత ప్రాసాదం
రెండూ అమర మహాకావ్యాలే.
సాహిత్యంలో ఒకటి అక్షరం
శిల్పసంపదలో ఒకటి అక్షయం
శతాబ్దాల తరంగాలలో రెండూ తేలాయి
శాశ్వత కీర్తి పతాకను ఎగురవేశాయి

మథిత సాగరములోనే
పుట్టాయి అమృతము, ఊర్వశి
సంక్షుభిత బాష్పసాగరములోనే
తాజ్ కల్పనలు, రూపురేఖలు
మానవుడు ఊహించిన సౌందర్య సృష్టి
ఎడబాటువగపుచే చనిపోయిన
కోర్కెకలలపై గోరీ.
మరణమును మరుగు పరచిన
విచిత్ర సౌందర్య యవనిక
దీర్ఘ వియోగానంతరమును
ప్రేయసిని విస రించ లేదని
ఘోషించే సౌందర్య సురదుందుభి
స్మృతి సింహాసనమున రాణించే
మృత బేగం రత్నముకుటము
విస్మృతి తిమిరాలను
ఛేదించే అనిర్వాపిత అఖండ జ్యోతి

మరపు చీకటి కెరటాలలో
తేలియాడు అందాల వెండి పడవ
మరచిపోయే విలాస వైభవాలను
మనస్సుకు తెచ్చే సౌందర్య కళా స్తంభము
భావికాల సరస్సులో
కోమల మృణాళాంకురముల
మెసవ నిరంతర ప్రయాణ మొనర్చు
అందాల మానసరాజ హంస
శోక శరత్ శర్వరులలో
ప్రఫుల్లమైన జ్యోత్స్నా ప్రసూనము
ఓదార్పు తోటలో పూచింది
దాని నేత్రావులే చల్లని పలుకులు
విరహాగ్ని శిఖా బాధితులకు
సౌందర్య శైత్యోపచార మండపము
హతాశా భగ్నహృదయ మర్త్యులకు
ఆశనిచ్చే సుధా పూర్ణకలశము
ప్రియ సాంత్వనముల చిలి సౌందర్యం
దుఃఖ నీరధిలో పొడిచిన భానుబింబం
మరణ శిరోభాగమున
వెలసిన నిశ్చల కీర్తి రథం
అకంపిత జ్యోతిర్ధ్వజము
అద్భుత కళారత్న మంజూషము
అకీయ సౌందర్య మధుభాండము.

౯

శాపముచే అహల్య
నల్లరాయి అయ్యెను
ప్రేమచే వియోగ వేదన
చలువరాయి అయెను
శాపాంతమున

రాయి నారిగ మారెను
విశృంఖల స్వప్నదేవత
పట్టుబడి బందియాయెను
మానవ శరీరపు చెరయందు
ప్రేమాంతమున
వేదన ఉండిపోయెను
చంద్రకాంత భవనమున
స రణ సువర్ణ సింహాసనమున
మూర్తీభవించిన సౌందర్యమై
దాని కంఠమును అలంకరించెను
సురధునీ తీరముల
పెరిగిన స్వర్గమందార తరువుల
పూచిన అమ్లాన పుష్ప మంజరులు
విరహప్రేమ పరాకాష్ఠ నొంది
వేదనా హాలాహలమును
తానే మింగి, చక్రవర్తి
చిర సౌందర్య రస
పీయూషధారల
మనకై వర్షించెను
పిడుగు నిప్పుల కడుపున వహింప
ఒడలంతా కాలి, చిల్లులు పడి
వాన జల్లుల కార్చిన మేఘమువలె
తాను ఆహుతియై మండి
మంగళహారతి అయ్యే
కర్పూరపు ముద్ద మాడ్కి
బురదలో పుట్టి, బురదను తిని
కిలకిల నవ్వుచు, కన్నుల గీటె
కమలకుమారి రీతి

నిట్టూర్పులే చెమటబొట్టుల తుడిచెనో
ఎన్ని మృగ తృష్ణలు మోసగించెనో
కాని తన సౌందర్య తృష్ణ తీరలేదు
ధన్యుడు ఆ సౌందర్య పూజారి
అమరుడు ఆ సౌందర్య ప్రేమికుడు.
నదికి ఈవలి గట్టున
తాజ్ మహల్ కి సరితూ.
నల్ల చలువరాతి మక్బరా
తనకొరకై నిర్మింపకోరి
పునాదులు వేసిన యత్నం
అంతటితోనే అంత మాయెను
పుట్టుకతోనే అంధునివలె
వెలిగింపని దీపమువలె
చెదరిన కలవలె
నిలిచిపోయెను తన చీకట్లలో
లేకున్న, తెల్ల చలువరాళ్ళ తాజ్ మహల్
ఎదురుగ నల్ల చలువరాళ్ళ మక్బరా
వెలసి యమునా నీరములలో
తమ అందాల తొంగి చూచుకొనేవి
రాధ ఎదురుగా కృష్ణునివలె
దివ్యమూర్తులుగ భాసిల్లేవి
సంధ్యా ముఖమున కాన్పించిన
శుక్ల చంద్రుడు త్వరగా అస్తమించి
రేయి అంతా చీకట్ల పాలుచేయును
చుక్కల దోపిడీ వదలును
కృష్ణపక్ష చంద్రుడు
తారల రంగస్థలం మీదికి
అలస్యంగా వచ్చినా
మిగతరాత్రి అంతా మేల్కొని
పృథ్విని కావలి కాయుచు

ఉదయభానుని అప్పగించి వెడలును
అట్టి కృష్ణ సౌందర్య ప్రాసాదాన్ని
మనకు ఇయ్యకనే
షాహజహాన్ అస్తమించెను
సౌందర్య తృష్ణ తీరకనే
ఎండిన నాలుకతోనే కన్నుమూసెను
తాజ్‌మహల్ పోటీని ఓర్వదుకాబోలు
అందుకనే అద్వితీయ సౌందర్య మయ్యెను
కృష్ణుడు లేని రాధ
మబ్బును విడనాడిన మెరుపు
ఏనుగును వీడిన దంతమువలె
తన ధావళ్య ఏకాంతములోనే
సౌందర్య తపస్సుకు పూనెను
రత్నాల మేడలో
నిత్యతారుణ్య వతియైన
అందాల రాణియై
అమరత్వమును పొందె
తపమునకు ఫలము సిద్ధించె
విశ్వమే సాక్షిగ
చక్రవర్తి ఘటించిన
శ్రద్ధాంజలి అది
ప్రేమస్మారక మది
సౌందర్య నిలయమది
అమరము వారి ప్రేమగాథ
ధన్యులు, ముంతాజ్ షాహజహానులు
(24-5-'77 నెల్లూరు)

# విసమ్మేళనం

సాహిత్య తూణీరములో
ఒకే కవితా బాణాన్ని వేసికొని
ఇతర సాహిత్య మృగయా వినోదులతోపాటు
నేను కవి సమ్మేళనపు అడవులకు
వేటకు వెడలగలను
సునాయాసంగ దొరకిన
శాలువ అనే జింకను
భుజాలమీద వేసికొని
సగర్వంగా ఇంటికి రాగలను.

(28-5-'77 నెల్లూరు)

# కాలము

ఎప్పటి వలెనే ఉదయించింది
పక్షుల కలకూజితాల
మేల్కొలుపు పాటలతో
నెత్తావుల మైమరచే
తెమెరలతో
అరుణోదయపు వన్నె చిన్నెల
అలంకారములతో.
నిన్న మొన్న అట్లా ఉదయించింది
వంద సంవత్సరాల ముందు
వెయ్యి సంవత్సరాల ముందు
అట్లా ఉదయించింది.
కాలానికి మొదలెక్కడ?
ఎన్ని కోట్లసార్లు ఉదయించిందో!
ఆరు ఋతువుల సొబగులతో
కాంతులతో, మబ్బులతో
మంచులతో, మబ్బు పేలికలతో
చల్లగాలి ఉయ్యేలలో
చిరునవ్వుతూ ఉదయించిందో!
కాని ఏ రెండు దినములూ ఒకటి కావు.
ఆ ఆ దినాల సంఘటనలు
సంక్షోభాలు, వృత్తాంతాలు
ప్రణయాలు, విషాదాలు
వేరు వేరు.
అనాదిగా పుట్టుచున్నవారు
ఒకరి కన్న ఒకరు భిన్నులు.
రూపంలో, తీరులో
గొంతులో జీవిత వివరాలలో
ఒకరి మాదిరి ఇంకొకరు లేరు.

అద్భుతమైన విభిన్నత్వం.
అట్లానే కోట్ల దినాల లెక్క తీసినా
ఏ రెండూ ఒకటి కావు
దినాలు నిరంతరం.
కాని నిత్యనవీనం.
జీవన మరణాలు
సుఖ దుఃఖాలు
అనురాగ ద్వేషాలు
సమర ఘోషలు
శాంతిప్రవచనాలు
వేరే, అన్నీ వేరే.

## 2

నేడు, రేపటికి నిన్న
ఎల్లుండికి మొన్న
ఇక నూరేళ్ళకు
నూరేళ్ళ క్రితం.
ఈ శతాబ్దము
ఇరవై ఒకటవ శతాబ్దానికి
పూర్వకాలం, గత శతాబ్దము.
వర్తమానం కాలరథాన్ని ఎక్కి
భూతకాలపు చీకటి గుహలో
అనుక్షణం కలిసిపోతుంది
నిన్నను ఇక మనము చూడలేము
ఆమె వేసికొన్న చీకటి ముసుగును
మనము సడలింపలేము
పోల్చుకోలేని వికృతమైంది
ఆమె వదనము
తళతళ లాడుచుండిన నేడు
ని ధచితాగ్నిలో మాడిపోతుంది

పునర్జన లేని నిన్నైపోతుంది.
ఎన్ని నిన్నలు కాలతిమిరగర్భంలో
చేరుకొన్నాయో ఎవరు లెక్కింపగలరు!
కాలసింధువులో, ఎన్ని నేడులు
చిన్న అలలవలె లేచి విలీనమయ్యాయో
వసంతములో ఎన్ని పువ్వులు వాడిపొయ్యాయో!
వర్షాకాలములో ఎన్ని నీటిబొట్లు రాలిపడ్డాయో

నేడును ఎదురులేని బలిమితో
ఆపలేని ఆకర్షణతో
ఎవరు గుంజుతున్నారు?
ఏ అయస్కాంత శక్తి అది?
నిన్నలన్ని చేరి
నేడు పడవను
ఏ తెలియరాని తీరానికి
ఏ పేరులేని రేవుకు
చేర్ప సంకల్పమో!
చీకటికొండల ఢీకొని
బ్రద్దలై, నిన్నల కడలిలో
మునిగిపోతుంది.

అరేబియన్‌నైట్సు కథలో
సుల్తాన్, రాత్రి
రమణితో రమించి
ఆమెను ప్రొద్దున్నే
చంపేవాడట.
మరలా రాత్రి
ఇంకొక రమణి
ఇంకొక వధ ప్రొద్దున్నే.

అట్లా నేడుతో రమించి
ఏ కాలపురుషుడు
నేడును చంపేస్తున్నాడో
ఎందుకో అంత కామోనా దము
ఎందుకో అంత వధోత్సాహము!

## 5

నేడు ఒక బుద్బుదం
రంగు రంగులతో రమ్యంగా ఉంటుంది.
కాలవాహినిలో తేల్తూ వస్తుంది
వచ్చేది పోవడాని
పుట్టేది చావడానికే
మృతిచితను మోసుకొంటూ వస్తుంది
ఒక్క దినములోనే
శైశవ యౌవన వృద్ధాప్యాలు
సగము వెలుతురు, సగము చీకటి
ఎన్నైనా జరుగవచ్చు
ఎన్నైనా విషమించవచ్చు
లక్షలమంది చావవచ్చు
లక్షలు పుట్టవచ్చు.

హావభావ విలాసాలతో
నృత్యభంగిమలతో
నాట్యముచేసే జవ్వని నేడు.
తళుకు బెళుకులను చూపిస్తుంది
కోపమువస్తే సూర్యుణ్ణి చూపిస్తుంది.
ప్రసన్నానికి చంద్రుణ్ణి కేకవేస్తుంది.
శృంగారానికి వేణిలోని
మల్లెల తారలను ఈలేస్తుంది.
సౌరభ సమీరాలను

శ్యామజలదాలను
సౌదామినీ కటాక్షాలను
ఇంద్రధనుస్సులను
విసరుతూ వస్తుంది.
చండమారుతాల కలను
పిడుగుల రొదలను
జలపాతాల రోదనను
సముద్రతరంగ ఘోషలను
వినిపిస్తూ వస్తుంది.
అధికారాన్ని గద్దె ఎక్కిస్తుంది
దుమ్ము లోనికి తన్నేస్తుంది.
ప్రళయనృత్యం చేస్తుంది
లలితసంగీతం పాడుతుంది
మయూర నృత్యాలు, పికకూజితాలు
మరాళ విహారాలు
ఆమె వనములోని దృశ్యాలే.
ఏమి చేయలేదు!
ఏమైనా చేస్తుంది
ఎంతైనా చేస్తుంది.

—

నిన్నల కంకాళాలు
కాలసర్పమైనాయి
పీలుస్తూ లాక్కొంటుంది.
నేడును, తన విపులవదన గహ్వరంలోకి
కరాళదంష్ట్రాలతో నమిలి
తన అనంత ఉదరములోకి పంపేస్తుంది
అభేద్యతిమిర దుర్గాలు అచ్చట వెలిశాయి.
తీరని క్షుద్బాధతో సతమతమగుతుంటుంది.
ఎన్నికోట్ల నేడులను పీల్చుకొంటుందో

ఇంకా ఎన్ని విజ్ఞాన విజయవిహారాలో
ఇంకా ఎన్ని సాంఘిక పరివర్తనలో
మానవుడు ఎన్ని ఔన్నత్య శిఖరాల ఎక్కవలెనో
నిత్యానంద చైతన్యములో తేలేది ఎప్పుడో!

ఇతిహాస దేవత కన్నులు తెరిచింది
యాభై అరవై శతాబ్దాలు కాలేదు.
వేదాలు అప్పుడప్పుడే వెలిశాయి.
యాభై శతాబ్దాల ఇతిహాసంలో
ఎంత ప్రగతిని సాధించింది మానవత్వము
ఎంత భాషావికాసము, ఎంత వేదాంతం
ఎంత సంగీతం, ఎన్ని లలిత కళలు
విజ్ఞాన యుగ ప్రారంభం
ఐదు శతాబ్దాలు కాలేదు.
ఆవిరి యంత్రాలు, విద్యుచ్ఛక్తి
రేడియోలు, విమానాలు
యక్సురేలు వగైరాలు.
శస్త్రచికిత్సలో ఎంత ప్రగతి
వైద్య విధానంలోనే ఎంత మార్పు
మానసిక క్షితిజాలు విస్తరిల్లుతున్నాయి
మానవుని అధికారాలు స్థిరపడుతున్నాయి.
వ్యక్తి స్వాతంత్ర్యము
దేశ స్వాతంత్ర్యము
సమాజ స్వాతంత్ర్యము
వయోజన వోటింగ్ అధికారము
శ్రామికవర్గ సంఘటన
వ్యవసాయంలో కొత్త వంగడాలు
ఎన్నెన్ని మార్పులు వచ్చాయి, ఇటీవలి ఏడులలో!

ప్రకృతి రహస్యాలు బహిర్గతమౌతున్నాయి
వేల ప్రయోజనశాలలు పరిశోధిస్తున్నాయి.
ఒక శతాబ్దపు భుజాలపై ఇంకొక శతాబ్దము
ఎక్కి చూస్తున్నది భవిష్యత్తు వైపులకు
మానవత్వపు ప్రయాణం ఎక్కడికో
ఏ దూరదిగంతాల శిఖరాలకో
ఏ జ్ఞానసాగర అగాథాలకో
ఇక వెయ్యేళ్లకు
ఇక పదివేలేళ్లకు
ఇట్లానే వికసిస్తుంది ప్రొద్దు.
అప్పుడు మానవత్వం ఏ రీతో
ఏ వేషాలో, ఏ ఊహాలో
ఏ యత్నాలో, ఎట్లా ఉంటుందో
ఊహానేత్రంతోనే చూడాలె
ఆశాకరదీపికలతోనే సాగాలె
మన వికసన ప్రయాణం.
మానవత్వపు శతపత్రము
శత దళాలను విప్పాలె
మానవులే దేవతలై పోవాలె
అసురత్వము అడుగంటాలె
ఉదార ఉదాత్తభావాలె స్థిరమైపోవాలె
అదే మానవత్వపు స్వర్ణయుగం
అదే అనంత ప్రయాణ దివ్యలక్షం.
(2-7-77, నెల్లూరు.)

# నేడు

మరణించిన భూతకాలపు అంధకారము
జన్మించని భావికాలపు అంధకారము
మధ్య మెరిసే జ్యోతిరింగణము నేడు

2

చీకటి కొండల రెంటి నడుమ
జాలువారు సన్నని వెలుగువాగు నేడు.

పెద్దదైన చీకటి తెరలో
వెలుగును చిందే చిన్నబెజ్జము నేడు.

అమావాస్యా నిశి తిమిరాధరముల
కన్పించే చిరునవ్వు నేడు.

5

నిత్య నిధిని తాల్చిన తిమిర ముకుటములో
మెరిసే ఏకైక రత్నము నేడు.

అనంతకాలపు నీల సింధువులో
స్వర్గమునుండి రాలిన అమృతబిందువు నేడు.

విశాల నీలాకాశములో
రెక్కలవిప్పి తిరి. అప్సర నేడు.

8

యమునానదీ కృష్ణ నీరములలో
జలకములాడు రాధ నేడు.

కుంతల తిమిర నికుంజములో
హసించే ఏకైక మల్లికా ప్రసూనము నేడు.

తిమిరార్ణవ శిరోభాగమున
ఉదయించిన నెలవంక నేడు.

తమాల కాననములో
కులాయమును కట్టుకున్న
శ్వేత విహంగము నేడు.

2

గగనవ్యాపిత ఘనాఘనముల
ముసుగును ఎత్తి చూచే
మెరుపుపడతి నేడు.

3

గడచినకాలపు కోట్ల నిన్నలను
రాబోవుకాలపు కోట్ల రేపులను
తగిలించే వెండికొలికి నేడు.

అంధకార మహార్ణవములో
రే, బడబానల స్ఫులింగము నేడు.

**5**

తిమిర రాత్రి
వెలి, ఒకే ఒక
తారా పదీపము నేడు.

**6**

వెడలిపోతూ పోతూ
నిన్నలు కార్చిన
కన్నీటిబొట్ల వరుస నేడు.

-

నిన్నలు
రేపులకు
అందిచ్చే
లేఖ నేడు.

పుట్టబొయ్యే రేపులను శిశువులకై
నిన్నలను మాతలు
చేయించిన
వెండి ఉయ్యాల నేడు.

భూతకాలము
చేసి వెడలిన
వెండి అక్షరాల
ఆటోగ్రాఫ్ నేడు.

**2**

భూతకాల శిథిలాలలో
దొరకిన వజ్రము నేడు.

## 2

భూతకాలపు చీకట్లను
భవిష్యత్తు కాలపు చీకట్లను
వేరుచేసే కరవాలము నేడు.

## 2

భూ కాలం
భవిష్యత్తుకు
స్వాగతమిస్తూ
పట్టే కర్పూరహారతి శిఖ నేడు.

## 2

అనంతకాలపు
కృష్ణలలాట ఫలకమున
తీర్చిదిద్దే
చందననామము నేడు.

## 2

వెడలిపోతూ అదృశ్యమయ్యే
అమావాస రథముపై
ఒక్క్ర మువతె వెలయు
బాలచంద్రుని కళ నేడు.

## 25

నీలోత్పల పూర్ణ కాసారమున
పూచిన కుముదము నేడు.

## 2

కోటి కాళ రాకసుల మధ్య
హనుమంతునికి కాన్పించే సీత నేడు.

2

ప్రళయకాల సంహారమునకై
వెడలు విరాట్ స్వరూపుడు
యమధర్మరాజుని
యజ్ఞోపవీతము నేడు.

2

దిగంత పర్వతాల
శిఖరముల నుండి
క్రిందికి పడే
జలపాతము నేడు.

2

చీకటి ఏరులో
తేలుచు పోతూ
చిరునవ్వే బుడగ నేడు.

వ్రజ వధువుల
జలక్రీడలచే
పులకిత గాత్రాయమున
వెలువరించు హాసఫేనము నేడు.

పాపక్షాళనము కాగా
పాతాళము నుండి
పైకి వచ్చే ధర్మమూర్తి నేడు.

2

భవిష్యత్తు కాల వల్మీకము నుండి
భూతకాల వల్మీకములోకి పాయ్యే
కుబుసము విడచిన శ్వేతనాగము నేడు.

(23-7-77, మద్రాసు)

# కాలపు ఆత్మకథ

లక్షల సంవత్సరాలుగ
కాలము నడుస్తూంది
తొలుత జీవం వచ్చింది
తర్వాత చెట్లు చేమలు పుట్టాయి
పిదప మానవుడు ఉదయించాడు.
లక్షల ఏడుల ప్రయాణంలో
మానవత్వం వికసిస్తుంది
అనంతం భూతకాలము
అశేషం భావికాలము.

## 2

భూతకాలం పోతూ పోతూ
తన కథ చెప్పుకొంటూ పోతుంది
కాలసైకతాల పదచిహ్నాల విడుస్తుంది
అక్కడక్కడ చేవ్రాలుచేసి పోతుంది
వేలిముద్రలను వేసి పోతుంది
తన కథ పుటలను పారవేస్తూ పోతుంది
అన్వేషించి, పరిశోధించి
గతాన్ని గూర్చి దిజ్మాత్రమునైనా
ఎరుక చేయడానికి యత్నిస్తున్నారు
శాస్త్రజ్ఞులు. చరిత్రకారులు, సాహిత్యపరులు.

ఎక్కడో శిలాగర్భాలలో
హిమాచ్ఛాదిత పర్వతాల కందరాలలో
లక్షల వత్సరాల పూర్వం
బురదమీద రాలిన
ఆకులు పువ్వులు, రెమ లు
వానిమీద మరలా బురద దొంతరలు

కాలక్రమేణ కఠినశిల కావడం.
అవే కాలపేటికలో దాచిన చిహ్నాలు
భావి తరాలకు పుడ్చిన లిబ్బెలు
కాలము చెవిలో చెప్పే గుసగుసలు
శాస్త్రజ్ఞులు వానిని పరిశోధిస్తున్నారు
శిల వయస్సు ఎన్ని లక్షల వత్సరాలో
ఇంచుమించుగా నిర్ణయిస్తారు.

ఇంకా ఎముకలు అట్లా దొరికాయి
కొన్ని పెద్ద జంతువుల
వంశనాశన మయ్యింది
బురద గుర్తులో ఎముకలో మిగిలాయి
అట్లా ఎన్నిటి సంతతి లుప్తమైందో!
మరి కొంతకాలానికి మానవుడు
పుడమిలో అవతరించాడు
మాటలు లేకుండా చాలకాలం
ఇల్లు లేకుండా, నిప్పు తెలియకుండా
చాల ఏళ్లు గడిపాడు
మానవత్వానికి శైశవకాలం,
మానవత్వం క్రమేణ పెరిగింది
ఎన్నో సోపానాల ఎక్కుతు వచ్చింది
మాటలు అక్షరాలు కుటీరాలు
వేటకు బాణాలు, కలహాలు
పెత్తనాలు ఏర్పడ్డాయి,
అప్పటికీ దీర్ఘ పయాణం జరిగింది.
వేదాలు వెలిశాయి
ఆ నాటికి సూర్యచంద్రులే దేవుళ్లు
వారిని పొగిడారు, ఆపదలు
రాకుండా చూడమని కోరారు

## 5

అప్పటికే కాలం
లక్షల సంవత్సరాల ప్రయాణం
జరుపుకొంటూ వచ్చింది,
ఎన్ని మజిలీలు దాటుక వచ్చిందో
ఎన్ని క్రొత్త ఆలోచనలతో ఊగిందో
ఎంత వచ్చిందో అంత పోవలసుంది,
మానవత్వాని యౌవనం
వచ్చిందేమో ననిపిస్తుంది
ఇంకా ముందున్నవి పెద్ద పెద్ద విజయాలు.

వేదాంతం, సంగీతం, సాహిత్యం
చిత్రకళలు చేతిపనులు పెరిగాయి,
రాజ్యాలు యుద్ధాలు వచ్చాయి,
ధర శాసనాలు, దానశాసనాలు దొరికాయి.
రాజ్యంలో చెలామణియైన నాణ్యాలు దొరికాయి,
కావ్యాలలో రాజవర్ణనలు పురవర్ణనలు
ఈషన్మాత్రముగ సమాజ వర్ణనలు వెలివడ్డాయి.
విజయ స్తంభాలు, స్తూపాలు
విహారాలు, శిలావిగ్రహాలు
అజంతా గుహ చిత్రాలు
తాటాకు పుస్తకాలు, భూర్జర పత్రాలు
రాజు ఉత్తరవులు, దరో పదేశాలు
యాత్రావర్ణన వివరాలు
అక్కడక్కడ దొరికాయి
భూగర్భంనుండి ఉబికాయి
వీని నన్నిటిని సమీకరించుకొని
చరిత్రకారులు, సాహిత్యకారులు
గతకాలపు చిత్రాన్ని

గీస్తున్నారు ఇతిహాసంలో
దాచిపెట్టిన ధనాన్ని
చిల్లర చిల్లరగ తీస్తున్నారు.
స్థలపురాణాల్లో, జానపద సాహిత్యంలో
లోకుల మాటల్లో, ముసలమ ల కథల్లో
మరికొంత విషయం తెలుస్తుంది.

7

ఎన్నో గ్రంథాలు ప్రాప్తం కాలేదు
దొరికింది కొద్ది, దొరకంది మెండు
కాలపు ఆత కథను విన్న
కొండలు నదులు మరచాయి
శాశ్వతంగా లుప్తమయ్యాయి కొన్ని
భూమాత కొంగు ముడిలో
ఇంకా ఎన్ని కాసులున్నాయో
ఎప్పుడు విప్పుతుందో, ఏమి చెప్తుందో
శిలాగర్భాలు, భూగర్భాలు, సముద్రగర్భాలు
ఎన్ని రహస్యాలను దాచి ఉన్నాయో
భూకంపాలు, అగ్నిపర్వతాలు
సముద్రపు ఉప్పెనలు, నదుల వరదలు
అగ్ని ప్రమాదాలు ఎంత పొట్ట పెట్టుకున్నాయో
ఎడారుల్లో ఎంత చరిత్ర నిదురిస్తుందో
పాటిదిబ్బలలో కాలచరిత్రాంశాలు మునిగి ఉన్నాయో
తాళపత్రాల్లో తెలియని విషయా లెన్నో
క్రమేణ తెలుస్తున్నాయి భూతకాల రహస్యాలు
పరిశోధకుల దృష్టి స్పర్శతో అహల్యలు లేవాలె
మురళీరవముతో జ్ఞానశేషులు ఆడాలె
గ్రంథాలయాలు కాలపు పాతరలు
పత్రికలు వ్రాస్తున్నాయి కాలపు డైరీలు
కాలపు అత కథలో వాక్యాలు కొన్ని

వినబడుతున్నాయి అస్పష్టంగానైనా
తిమిర హారద్వారము గుండ
వెడల్తూ కాలం ఏదో చెప్పుతుంది
దాని ప్రతిధ్వనులే చరిత్రకు ఆధారం
అదే గతయుగ పూర్వజుల పురాణం.

(29-7-'77, నెల్లూరు)

# నిన్నలు

ఒకనాడు
కళ కళలాడుచుండిన నేడు
తళుకు బెళుకులను ముగించుకొని
అదృశ్యమై నిన్నల సేనలో చేరింది
నిన్నలు బారులు బారులుతీర్చి
నల్లని వేషాలతో వరుసగా నిలిచాయి
ఎన్ని వరసలో ఎన్ని బారులో
పెద్ద అడవిలో నీడలవలె నున్నాయి
కాయములేక స్మృతియై యున్నాయి
అనంతకాళ సైన్యమువలె నున్నాయి
భవిష్యత్తు సామ్రాజ్యము మీద నా
ఈ సమీకరణ? ఈ సేనల పటాలాలు
భవిష్యత్తు ముఖద్వారాన చేరి
బయటికి వచ్చే సైనికులందరిని
భయపెట్టి తమ స్మృతి వాహినిలో
చేరండని బలాత్కరించాయి
లొంగని భవిష్యత్తు గెలవని భూతకాలం
అవిరళ సమరం జరుగుతునే యుంది
ముగిసేయుద్ధం కాదది
అనంతకాల సమరమది

## 2

నిన్నల అద్దము ఒకటైనా
వేరు వేరు ప్రతిబింబాలు
చూచే వారినిబట్టి మారుతుంటుంది
పెక్కుమందికి దుఃఖాన్నే ప్రతిబింబిస్తూంది
కొంతమందికి సుఖాన్ని పేలవంగా చూపిస్తుంది
స్మృతి రాజ్యంలో

సుఖ సంపదలకన్న
దుఃఖ ఆపదలకే
బలం శక్తి ఎక్కువ
జన్మదినం విజయ దినమునకన్నా
మరణదినం, పరాభవ దినాని
దీర్ఘాయుస్సు ఆ స్మృతి రాజ్యంలో
కుమారుడి పుట్టిన దినానికన్నా
చనిపోయిన దినమే బుసకొట్టుతు వస్తుంది
వివాహ దినానికన్నా
వైధవ్య దినమే పైకి తేలుతువస్తుంది
సంతోషం ప్రసన్నదేవతయైతే
విచారం ప్రబల నిష్ఠుర రాకసి
మనము అనుభవించిన
ఆనంద విషాదాలు
నిన్నలలో చేరి స్మృతులైయున్నాయి
దినాలు గడిచేకొద్దీ
స్మృతి సన్నగిల్లుతూ వస్తుంది
కొన్ని కొన్ని దుఃఖాలు
కాలం గడిచినా వాడిగా వుంటాయి
సుఖాలు మాత్రం మాసిపోతాయి
సైకతాలమీద పదచిహ్నాలవలె
నిన్నలు నేడులుగా
రాజ్యం చేసిన కాలంలో
ఎన్నెన్ని విషమ సంఘటనాలు జరిగాయి
కొందరిని పులిగోళ్ళయి చీల్చాయి
విషసర్పాలై కరచాయి
సంపాదించే యజమాని
హృద్రోగముతో మరణిస్తే
పిల్లల చదువులేమి
ఆడపిల్లల పెళ్ళిళ్ళు ఎటుల

తల్లి ఎట్లా పోషిస్తుంది
కుటుంబానికే గరళ దినమయ్యింది ఆ నేడు
వైద్యం చదివే పుత్రుడు
సముద్రంలో ఈదుచు మరణిస్తే
తల్లి తండ్రుల ప్రాణాలు కూలిపోయి
కలలన్ని చెదిరిపోయి
అప్పుల భారం కనబడుతుంటే
మరలో తిప్పినట్లే ఉంటుంది ఆ నేడు
వివాహం జరిగిన కొద్ది నాళ్ళ
భర్త రోడ్డు ప్రమాదంలో చనిపోతే
ఆ రమణి సౌభాగ్యమంతా దుమ్మైపోతే
ప్రమోద సౌధాలమీద పిడుగుపడితే
ఆమె సంతోషాల ముఖాన్నే పులిచీల్చివేస్తే
ఎంతటి దుర్భర విషాద దినము ఆ నేడు
నేడులుగా వుండిన ఆ నిన్నలు
ఎంత నిర్దయగా ఎంత క్రూరంగా
ప్రవర్తించి వెళ్ళాయి
ఎంత నిష్ఠురవర్తన ఎంత హింసా ప్రవృత్తి
ఒకనాడు కల్గించిన కీడును
చాల నేడులు మోస్తూ మూలుగుతుండాలె
చాల నేడులు పెంచిన చెట్టును
ఒక నేడు క్రిందకుత్రోసి పోతుంది

కొన్ని నిన్నల సముదాయాలు
వజ్రాలవలె మెరిసే నేడులరాశియై
ఒక యుగాన్ని ఒక శకాన్ని నిర్మిస్తాయి
విక్రమాదిత్యుని యుగాన్ని
సాహిత్య నవ రత్నకాలమని
సప్తకావ్యాల కాళిదాసుని శకమని

ఇప్పటికీ స రించుకుంటున్నాము
కృష్ణరాయల కాలమని అక్బరు కాలమని
గాంధి యుగమని ఉప్పొంగుతూ అనుకుంటాము
అట్లానే కరువు దినాలని యుద్ధ దినాలని
నిట్టూరుస్తూ అనుకొంటాము
నేడుల పూర్వజులు నిన్నలు
నిన్నలు బ్రతికియుండిన కాలంలో
ఎన్నెన్ని అత్యాచారాలు చేశాయి
ఎన్ని నిర మ దురంతాలు విషాదఘట్టాలు !
కన్నీటి కడలినే కల్పించాయి
చితాభసా లనే రాశాయి
రు ద్రదీపావళులే జరిపాయి
విలయ నృత్యాలు, సంహారక్రీడలు
గతం వదలిన జ్ఞాపకాలు

నిన్నలు పురి పెట్టుతూ
రేపుల దూదినుండి
వడికిన సన్నని దారము నేడు
అట్టి దారాల పోగులతోనే
నేసిన బట్ట మన జీవితం
కొన్ని నేడులు హితవును కూడకల్గించాయి
రామాయణం వ్రాయబడిన నేడులు
ఆవిరి యంత్రాలను చేసిన నేడులు
విద్యుత్ శక్తిని కనిపెట్టిన నేడులు
మంచినే సౌభాగ్యాన్నే కూర్చాయి
కాలభవనంలో తలుపులు మూశాయి రేపులు
కవాటాలు తెరువలేదు నిన్నలు
చిన్న గవాక్షాన్ని తెరిచింది నేడు
నిన్నల సమాధుల శ్రేణులే

## 5

పరుగెడుతూ
నిన్నల గుర్రాలు వదలిన
నోటి నురుగులు గిట్టల గుర్తులు
మన జ్ఞాపకాలు
కొన్ని తోడనే నశిస్తాయి
కొన్ని మెల్ల మెల్లగ సన్నగిల్లి మాసిపోతాయి
కొన్ని చిరకాలం ఉంటాయి
తడిచిన కాళ్లతో శిలాఫలకాలపై
వేసిన గుర్తులు మూడు నిముషాలుంటాయి
ఇసుక పర్రలలో గుర్తులు మూడు దినాలుంటాయి
బురదమడుగులలో గుర్తులు ఎండి
వానల వరకూ ఉంటాయి
నల్లసున్నపు పూతపై
పడిన కాలి అడుగులు
చెదరకుండా చాలా కాలముంటాయి
భూతకాలాన్ని చూసే
టెలిస్కోపు మన జ్ఞాపకాలు
దృశ్య వివరాలన్నీ కనబడవు
కొన్ని ఘట్టాలే కనుపించేది
అప్రాప్త వాంఛలు విఫల మనోరథాలు
భగ్నప్రణయాలు
చాలాకాలము విహరిస్తాయి మనోగగనంలో
ప్రియజన వియోగాలుః అంతె
బాల్యకాలపు చదువులు
యాత్రా భ్రమణాలు
సున్నిత మధురఘట్టాలు తిరుగుతాయి స్మృతివనంలో
కంఠస్థము చేసిన పద్యాలు శ్లోకాలు

మరచిన పాటల మరవని చరణాలు
పురాతన మిత్రుల ముఖాలు కంఠాలు
తేలుతూనే ఉంటాయి స్మృతి సాగరంలో
జ్ఞాపకాల గవాక్షాల గుండానే
తిలకిస్తాము నిన్నల దిగంతాల అస్పష్టచిత్రాలను
తొలగుచున్న కారుమబ్బులను
చెరగుచున్న ఇంద్రధనస్సులను

—

జ్ఞాపకశక్తి చాలా శక్తిమంతమైనది
చాలకాలపు స్నేహితుని గుర్తుపట్టలేక
గొంతును గుర్తుపట్టి పేరు చెప్పాను
కంఠధ్వని ఎట్లా స్మృతిలో మిగిలిందో
నే నాశ్చర్యపడ్డాను
మెదడు ఎట్లా జ్ఞాపకముంచుకొన్నదో
అన్నిటి మధ్య ఆ చిన్న విషయాన్ని
ముసలితనంలో జ్ఞాపకాలు సన్నగిల్లుతాయి
ఇటీవలవి మాసిపోతాయి
చిన్నతనానివి చెదరిపోవు
ప్రయాణ సామాన్లు ముందుగా పంపినట్లు
మరణానికి పూర్వమే
జ్ఞాపకశక్తి శ్రవణశక్తి
వీక్షణాశక్తి పంపేస్తాము
ముసలితనంలో

—

నిన్నలు గుహ అయితే
రేపులు గోడలు
గుహలోకి కొద్దిగా చూడవచ్చు జ్ఞాపకాలతో
గోడను దాటి చూపు పోలేదు
కోర్కెల రెక్కలపై కలల అలలపై

ఎగురుతు చూపు చూస్తుంది
రేపుల ముఖాలను
అదే వాంఛా ప్రపంచము
స్వప్న సామ్రాజ్యం
నిన్నలు నేడులు రేపులు
అనాదికాల వంశపారంపర్యం
అనంత నిరంతర ప్రయాణం
క్లాంతిరహిత నిత్యకాల విహారం.

(25-8-77, నెల్లూరు)

# జనార్ణవము

దేశంలో ఎన్నికలు
ప్రజాస్వామికానికి వసంతం
పాత ఆకులు రాలవలె
క్రొత్త ఆకులు చిగిర్చవలె
మూగ కోకిల పాడవలె
అణగిన ప్రజావాణి పలుకవలె
ఇటు నటు గాలులు వీయవలె
జనార్ణవము ఘోషించవలె
పుట్టలలో దాగిన పాములు
పడగ లెత్తవలె
కోర్కెలు ననలెత్తవలె
పార్టీల వాగ్దానాలు వర్షించవలె
సమర దుందుభులు మ్రోగవలె
పాంచజన్యాలు దేవదత్తాలు పూరించవలె
జండాలతో రథాలు పల్లెలకు పాకవలె
వివిధ నినాదాలు చెలరేగవలె
అర్ధరాత్రివేళల ఊరేగింపులు ఉపన్యాసాలు
కొనసాగవలె
బాలుర యువకుల తిరునాళ్ళ
ఎంతో ఉత్సాహం ఎంతో కోలాహలం
ప్రభలతో అభ్యర్థుల చిత్తరువులతో
పార్టీ నాయకుల బొమ లతో
సాగింది ఎన్నికల రథం
అభ్యర్థుల పేర్లకన్నా ఎన్నిక గుర్తులు
ముందుకొచ్చాయి.
గుర్రానికి మా ఓటు సైకిల్‌కే మన ఓటు
అంటూ కలు రేగాయి దిక్కులు మారో గాయి
గుర్తుల సుడిగుండాలలో అభ్యర్థులు క్రిందికిపోయారు

అవసరమైతే ధర రాజువలె
మెత్తని అబద్ధాలు చెప్పారు
వలసిన గుప్తాస్త్రాలను వదిలారు
ధనాన్ని విరివిగ వాడారు
ఉత్తరకుమారుని వ్యర్థ ప్రలాపాలు
భీష్మ పితామహా సింహగర్జనలు
ధనంజయ గాండీవ టంకారాలు
దుర్యోధనుని ప్రోత్సాహాలు
శకుని గుప్త మంతనాలు
అన్నీ రాశియై వెలిశాయి
జనార్ణవాన్ని చిలికారు

## 2

ఓట్ల దినం వచ్చింది
ప్రజావాహిని నురుగుల నవ్వింది
ఉత్సాహపు తుఫానురేగింది.
బారులు తీర్చారు ఓటర్లు
పురుషులకన్నా స్త్రీలే ఎక్కువ వచ్చారు
కన్నుల పండువుగా ఉండింది సంబరం
సభలకు రానివారు అక్షరజ్ఞానం లేనివారు
పండితులతో మేధావులతో ఒ వరుసలో నిల్చారు
ఘోషాస్త్రీలు పర్దాస్త్రీలు గ్రుడ్డివాళ్లు కుంటివాళ్లు
ముసలివాళ్లు వచ్చారు.
నడుస్తూ వచ్చారు బండ్లు కట్టుకొని వచ్చారు
హరిజనులు బ్రాహ్మణులు రైతులు
కొట్లుకట్టేసి వర్తకులు
ఒక్కరేమిటి అందరు వచ్చారు
మౌనంగా వచ్చారు పార్టీ గుర్తులతో వచ్చారు
మీ ఓటు మీ ఓటు
అంటూ కొందరు వచ్చారు

రహస్య ఓటింగు విధానం
వారి వారి అభిరుచి ప్రకారం
వారి వారి ఇష్టం వచ్చినట్లు
నోరు కట్టేసుకొని హృదయం విప్పుకొని
ఓటుచేసి వెళ్ళారు.

—

లెక్కింపు దినం వచ్చింది
భయ సందేహాలను అణుచుకొంటూ
శుష్క మందహాసాలు చేసుకొంటూ
విజయ దృశ్యాలను కలగంటూ
కొద్ది ఓట్లు అధికంగానైనా
గెలవవచ్చుననే సన్నని ధైర్యంతో విచ్చేశారు
అభ్యర్థులు అభిమానులు
గెలవడం తథ్యం పెద్ద మెజారిటి వస్తుంది
పందెం కట్తామంటూ కొందరు
ఉత్తరకుమార ప్రలాపాలు చేస్తూ
పూలమాలలు చేర్చుకొని
హడావిడిగా నవ్వుచు వచ్చారు
ఓట్లపెట్టెలో ఏ అలిఖిత నిర్ణయముందో
ఏ భవిష్యత్తు మేలిముసుగు వేసుక వుందో
బుట్టలో పరుండియున్న పాము లేచి పడగవిప్పి
ఎవరిని కాటేస్తుందో
మంజూషములోని విజయమణి
ఎవరికి ప్రాప్తమో
ఎవరి భాగ్యమందు నిద్రిస్తుందో
ఎవరి అదృష్టదేవత రచిస్తుందో
లలాటమున జయ తిలకమును
కంఠసీమలో వేస్తుందో జయమాలను
మోహిని గంట చూస్తూ పంచుతుందో

అమృత మెవరికో విష మెవరికో
దమయంతి ఏ నలుని వరిస్తుందో
దిష్టి తీస్తూ తల్లి ఎవరికి హారతి పడుతుందో
విజయానందాన్ని పంచుకుంటూ
ఏ అర్ధాంగి స్నేహితుల సత్కరిస్తుందో
ఎవరికి అరణ్యపర్వం అందిస్తుందో
ఎవరికి సభా ఉద్యోగపర్వపు ఊరేగింపులో
ఏమీ తెలియని ఆశానిరాశల సంధ్య అది
చీకటి వెలుగుల సంధి అది
గెలుపు ఓటముల పందెమది
అవమానపు కఠిన శిక్ష ఎవరికో
ఎవరిఘృతం బూడిద పాలో
చేసిన అప్పులు జ్ఞప్తికి వస్తూ
పగటి అరుంధతిని చూచేదెవరో
ఎవరి హృదయంలో ప్రచండమారుతాలో
ఎవరి తలపుల కడలిలో బడబానలమో
ఓట్లపెట్టి ఏమి పలుకుతుందో
ఏరాగాన పాటలు పాడుతుందో
ఆ పెట్టె అడుగున అమావాస్యే దాగిందా

ఓట్ల ఊయలలో విజయలక్ష్మి ఊగింది
ఇటు మొగ్గుతూ అటు మొగ్గుతూ కులికింది
క్రీగంటి చూపుల చిరునవ్వుల
ఇటునటు పంచుతు వచ్చింది
జనార్ణవములో ఆటుపోటు వచ్చింది
ఊగుటలో పవిటవలె
లోకుల డెందాలు రెపరెపలాడాయి
ఉయ్యాలాటలు మాని
ఒకరివైపు బాగా మొగ్గింది

సందిగ్ధపు మబ్బులు తొలిగాయి
ప్రజలు కొందరు పోగా
మరింతమంది కూడారు
ఫలితం తేలింది ఓట్లమ్మ తీర్పు చెప్పింది
హర్షధ్వానాలు విజయతూర్యాలు వెలిశాయి
వెలుగుల మతాబులు మెరిశాయి
ఆకాశాన్నే కొరడా దెబ్బలు కొట్టినట్లు
ఔట్లు వరసగా ప్రేలాయి
సహస్ర తిమిరపుంజాలడ్డగించినా
సూర్యుని తేరు గుర్రాల రాకను
అడ్డగించే దెవరు?
గెలిచాడు ఒకడు
ఓడింది అయిదుమంది
గెలిచినవానిని అందరూ చుట్టారు
విజయరథాన్ని మేమంతా లాగాము
మా వూరి ఓట్లు తొంభై శాతం
మీకే పడ్డాయని చెప్పారు
ఊరేగింపుతో ఇంటికి చేర్చారు
అచ్చట మందస్మితాలే తోరణాలు
ఆనందాశ్రువులే పూర్ణకుంభాలు
దిష్టితీసారు హారతి పట్టారు
వారంలో మంత్రివర్గం కుదిరింది
ఎన్నికల చెట్టు కొసకొమ న
పూచిన పువ్వు అది
ప్రజా సంకల్ప సిద్ధి అది
ప్రజాస్వామ్య రసాగర నవనీతమది
జనార్ణవ మథనామృతమది
(జూలై 1977, నెల్లూరు)

# వకుళవితానము

ద్వారానికి ఇటు అటు రెండు పొగడచెట్లు
నాటి చాలకాలమైంది బాగా పెరిగాయి
ఎత్తై చిక్కగ కలసిపోయాయి
కొన్ని కొమ లు ఏ చెట్టువో తెలిసేవి కావు
సహజమైన స్వాగతమండపము వలె ఉండేది
ఎండవేళల చల్లని నీడలతో అందరినీ ఆహ్వానించేది
బాలబాలికలు ఆడుకొనుటకు వీలుగా ఉండేది
జడివానలో తలదాచుటకు అనువుగా వుండేది
ప్రకృతి ఎత్తిన నీలఛత్రమువలె ఉండేది
ఋతువులకు స్వాగతమిస్తూ శాఖాహస్తాలు చాపేది
మలయసమీరాలను రమ్మని నవ్వుచు పిలిచేది
పెద్దగాలులకు ఒడలంతా తలచేసి ఊపుచుండేది
చీకట్లు దాగి పరుండుటకు ఆశ్రయమిచ్చేది
వెన్నెలలో నిగనిగ మెరిసే తలపాగా దాల్చేది
ఉదయకాంతికి సంధ్యాకాంతికి మిసమిసలాడేది
గృహప్రాంగణానికి శోభను ఇచ్చే వకుళవితాన మది
చెమటల ఓర్చే శ్రమికుల చల్లని పర్ణకుటీర మది

## 2

తరుమూర్తుల తాల్చిన మాయావులా
సదా పరిరంభణలో మెసలే దంపతులా
అహర్నిశలు అవిరతచుంబన నిరతులా
భుజాలమీద చేతులవేసి నిలచే స్నేహితులా
మల్లయుద్ధమునకు నిలిచిన వీరయోధులా
శిరోజాల విరియబోసి పోరునకై నిలిచిన
రాక్షసులా తాటక శూర్పణఖలా
తలలూపుచు దంతాలు రాసుకొంటూ
ఢీకొనే మదమెక్కిన గజేంద్రులా

భుజాలు అప్పళిస్తూ ఎగబడిన వాలి సుగ్రీవులా
ఇంద్రుని శాసనమును ధిక్కరించి
భూమికి దిగివచ్చిన రెండు మేఘఖండాలా
రెండు నల్లరాతి బండలు బంజారాలో తలపడెనా
ఇల నిలిచిన నల్లపాగడిబ్బలు కలహమునకు దిగెనా
చీకటి రాత్రిళ్ళు అవి అట్లా, కనబడతాయి

ఆ భూరుహాల సంపద చూడాలంటే
వేకువ సంధ్యాకాలాన వానిక్రింద నిలవాలె
చెట్లంతా కలకల పాటలు పాడినట్లే ఉంటాయి
వందల పిట్టలు సంజెమసకలలో చేర్తాయి
అరగంటసేపు గలగల మాట్లాడుకొంటూ వుంటాయి
ఊరి కబుర్లంతా చెప్పుతూ ఉంటాయి కాబోలు
లేక జరగబోయే సంగతులే చెప్తాయో
ఏమి ఆనందమో ఏమి చెప్పాలని కోర్తాయో
ఏ తియ్యని వేదనల తెలుపు పాటలో అవి
ఏ విజయాన్ని ప్రకటించే కేకలో అవి
భిన్న భిన్న పక్షుల నానావిధ రాగాలు
జంత్రస్వర సమే ళనాలా?
చీకటుండగానే లేస్తాయి
అరుణోదయమవుతుందని ఎవరు చెప్పారో
చీకట్లో వచ్చే వెలుగుల బాకాలూదాయా
మనకు తెలియని ఏలోకం నుండి కబురొచ్చిందో
లేచి మాటల పాటల కచ్చేరీలు ప్రారంభిస్తాయి
ప్రొద్దున్నే పిల్లలునేర్చే వీథిబడిని తెరచారా
అంటాడు ఉర్దూమహాకవి గాలిబ్
వింతగా శ్రావ్యంగా వుంటుంది వినడానికి
కొంత వెలుగు కాన్పించేసరికి
బయలుదేరతాయి పక్షులు నలుదిక్కులకు

భూరుహ రాజాజ్ఞని కొని పోతున్నాయా
అజ్ఞాత ప్రదేశాలకు మిన్నుల దవ్వుల చెరగులకు
పగలంతా రావు ఎచ్చటో వాని పని
సాయంత్రానికి అదే చెట్టుకు అదే గూటికి
చేరుకుంటాయి తప్పులేకుండా
విచిత్రం విహంగాల క్రమశిక్షణ
రెండు స్తంభాల తరువితానం
విహంగాల విశ్రాంతి ధామం
తలపవన వకుళద్రుమ యుగళం
(6-9-'77, నెల్లూరు)

## చీకటి

చీకట్లో నీ కళ్ళ తళతళలు చూడాలి
ఆరిపేయవె దీపము
అన్నాడు నాయుడుబావ
నిప్పు చీకట్లో తళతళలాడుతుంది
నిప్పురవ్వలు నిప్పు మంటలు
చీకటి వేదికపై నృత్యం చేసినప్పుడే
కాంతివంతముగ ప్రజ్వరిల్లుతాయి
చీకటి రేయి బాటల్లో పోయేటప్పుడే
చుక్కలు బాగా మెరుస్తాయి
నల్లని మబ్బుల పల్లకీలో
మెరుపు పడతి తళతళలాడుతుంది
కృష్ణుని తెరమీదనే అర్జునుడు శోభిస్తాడు
చీకట్ల తాంబూలము వేసినప్పుడే నిప్పులు
తృప్తిగా పకపక నవ్వుతాయి
చీకట్లో కళ్ళు తళతళలాడేది
కవి సమయమా వాస్తవమా

## 2

శారీరక నేత్రం చూడంది
మనోనేత్రం చూస్తుంది
శారీరక నేత్రాని వెలుగు కావాలె
మనోనేత్రానికి వెలుగు నిరోధము
వెలుగులో అన్నీ అడ్డులుగా నిలుస్తాయి
గోడలు పైకప్పులు కిటికీలు
అడ్డంగా నిలుచుంటాయి
చీకట్లో ఇవన్నీ అంతర్ధానమవుతాయి
మనోనేత్రం దూరదూర దేశాలను

నిర్నిరోధంగా వీక్షిస్తుంది
అంధకార దుర్భిణిగుండా
చాల చాల విషయాలు చూడొచ్చు
అంధకారములో మనోనేత్రం వికసిస్తుంది
వెలుగులో భౌతిక నేత్రానికి
అన్నీ అడ్డులే, చొరరాని పద్మవ్యూహాలే
కొన్ని సమయాల్లో వెలుగుకన్న
చీకటే మెరుగు
చీకటి చూపుకు అడ్డులు లేవు
చీకటి కవాటాలే కనురెప్పలు

3

ధ్యానానికి కన్ను మూతకావాలె
దీర్ఘాలోచనకు కన్ను మూత కావాలె
పాటను శ్రద్ధగా వినాలంటే
వెలుగును దూరముచేసే కన్ను మూతకావాలె
అన్నిటికన్నా నిద్రారంగముపై
స్వప్నాలు ఆడాలంటే కనురెప్పలు మూయాలె
కన్నుమూతే కనువిప్పుకు దారి తీస్తుంది
హృదయశాంతికి పీటలు వేస్తుంది

చీకట్లో అంతా స్వేచ్ఛే
నడవడానికి ఈదడానికి
ఎగరడానికి స్వేచ్ఛే మనస్సుకు
మనస్సు బాగా వికసించేది చీకట్లోనే
చావే చీకటి కాలము చీకటి
గతకాలపు చీకటి పొలిమేరలకు
వచ్చేకాలపు చీకటి సరిహద్దులకు
నడుమ నేడు

కళకళలాడే కాలబిందువు
అనంతత్వానికి కవచము అంధకారము
జీవము పుట్టేది పెరి. ది
గర్భకోశపు అంధకారములోనే
అన్నిటినీ సమానం చేస్తుంది చీకటి
మహత్తరమైన శక్తి వుంది చీకటికి
శక్తిస్వరూపమే చీకటి
కాళి స్వరూపమే చీకటి
బాహ్యేంద్రియ అవరణె చీకటి
అట్టి చీకట్లో ఎంకి కాటుక కన్నుల
తళతళ చూడాలనిపించింది
నాయుడు బావకు
అందుకే అడ్డంగా
సైంధవుడు మాదిరి నిలిచియున్న
దీపాన్ని ఆర్పమన్నాడు
(6-12-'77, నెల్లూరు)

# మా ఊరి రావిచెట్టు

మా ఊరి బయట ముసలి రావిచెట్టు
గత శతాబ్దంలో ఎవరు నాటిందో
బాగా పెరిగి అన్నిదిక్కుల శాఖల చాపింది
చిన్నప్పటినుండీ బాగా ఎరిగిన చెట్టే
ప్రక్క ప్రక్క ఊర్లకుపొయ్యే దారిలో ఉంది
కాలినడకతో పొయ్యేవాళ్లకు ఆశ్రయమిచ్చేది
దాని మొదటిలో అనువుగా అరుగు కట్టారు
కూర్చోడానికి పడుకోవడానికి వీలుగా వుండేది
చెట్టునీడన చిన్నతనాన ఆడే వారము
పశువుల కాయుచు ఎండల్లో పిల్లలు చేరేవారు
బాటసారులు వానల్లో చుట్టూ ఒదిగే వారు
చీకట్లో జుట్టురేగిన దయ్యంవలె ఉండేది
సంధ్యాకాంతిలో తళుకుల చేలము కట్టిన
మహిళవలె మెరిసేది
ఋతువులు తమ తమ ఆటల పాటల
రావిచెట్టు దర్బారులోనే జరిపేవి
కొమ్మలు వీధులు కాగా
చెట్టు ఊరుగా ఉండేది పిట్టలకు
సంజెవేళ లేత చీకట్ల పిలుపులు విని
పిట్టలన్ని గుమి కూడేవి
కలభాషణాలతో దినచర్యలు సమీక్షించుకొని
తమ తమ గూడులకేగేవి
వేకువనే లేచి చెట్టుకు సుప్రభాతం పాడేవి
బాకాలూది చీకట్ల తొలగమని చెప్పేవి

## 2

చెట్టుప్రక్కనే మలిదేవి కాలువ పారేది
చెరువులో పుట్టి సముద్రానికి పొయ్యేది

తటాకమునుండి సముద్రానికి
ఏ వార్తల కొని పొయ్యేదో
తూర్పుగపోతూ చెట్టు దగ్గర ఉత్తరంగా తిరిగింది
ఉత్తర ముఖముగా పారే నీళ్ళు శుభమని అంటారు
శుభముగ పారుచు చెట్టును పలకరించి వెళ్ళేది
ఎండల్లో ఎండక నీళ్ళు పారుతూ ఉండేవి
వానాకాలం అప్పుడప్పుడు ఉగ్రమై లేచేది
శక్తిని చూపుతు ఊరంతా ముంచేది
భగ్గునమండి శాంతించే అగ్నివలె
ఉగ్రరూపాన్ని వదలి సౌమ్యరూపం తాల్చేది
రావిచెట్టుమలిదేవి మాఊరికి ముఖ్యమైన విషయాలు
మలిదేవి గట్టున చెట్టుకు ఉత్తర దక్షిణముల
సన్నగ వ్యాపించి ఉండేది మా ఊరి శ శానం
చనిపోయిన పెద్దల దహనం
పిల్లల ఖననం జరి। దచ్చటనే
మాఊరి అంతిమ యాత్రాస్థలం
పరలోకానికి సింహద్వారంగ
నాగజెముడు తోరణాలతో
శోభిలేది మాఊరి శ శానం
చెట్టునీడ మలిదేవి నీళ్ళు
కర కాండలచేసేవారికి ఉపకరించేవి

రావిచెట్టు శ శానాధిపతిగ ఉండేది
దాని రాజ్యంలో మరణాలే జననాలు లేవు
రావిచెట్టుకే మరణ అంతిమవార్త
దాని కవాటాలగుండా పోయిన కాయం
చితా భసా లలో ఏలీనమగుతుంది
అక్కడనుంచే మరణరాజ్య ప్రారంభం
పరలోకానికి అక్కడనుంచే సోపానాలు

రావిచెట్టు ఎన్ని శవదహనాలను చూచిందో
మాతాత ముత్తాతల దహనం చూచింది
మాఊరి గతచరిత్రంతా అవగతమే
జ్వరమరణాలు రాచపుండు మరణాలు
కలరా చావులు ఆత్మహత్యలు ఖూనీలు
అన్నీ చూస్తూ తల వూపింది
చితాధూమాలే సాంబ్రాణి ధూపాలు
చితాగ్నులే దానికి హారతి శిఖలు
ఆ మంటల్లో చెట్టు తళతళలాడేది
ఆ వాసననే పీలుస్తుండేది
వానలు ఎండలు చీకట్లు చలిగాలులు
ఏమీ అడ్డగించలేవు శ్మశాన జ్వాలలను

ఎన్ని దిగులు గుండియల చూచిందో
ఎన్ని ఏడ్పులు విన్నదో
ఎన్ని అశ్రుధారలు తరుచ్ఛాయలసిక్త మొనర్చాయో
చనిపోయినవారి ప్రశంశలు వింటూ ఉండిందో
ఓదార్పుమాటల వైరాగ్యపు మాటల
ఒళ్ళంతా చెవిచేసి ఆలకిస్తూ వుండేదో
గ్రామశోక భారమంతా
చెట్టున గూడుకట్టుకొన్నది కాబోలు
మరణదుఃఖమే తరురూపము దాల్చిందా
ఏడ్పుల నడుమ మంగళసూత్రాలు తెగ
వైధవ్యచిహ్నాలను చూడలేకపోయిందో
ఎందరు తల్లులు పుట్టక పుట్టక పుట్టిన
శిశువులను భూమాత వడిలో చేర్చిపొయ్యారో
కాని అశ్వత్థ వృక్షము స్థితప్రజ్ఞునివలె ఉండేది
మహా వేదాంతివలె నిల్చేది
పుట్టుట గిట్టుటకొరకే

అనే జీవనరహస్యాన్నే చాటేది
చల్లని నీడలతో ఉపశమన పదములు పలి ది
ఆ చెట్టు ఒడలంతా మా గ్రామ చరిత్ర
విషాదసంస్థ దిగుళ్ళ దిబ్బ
గడచినకాలపు స రణ పరంపరలు
ఆవలిస్తూ లేస్తాయి
ఆ చెట్టును చూస్తుంటే
మా వూరి మరణ దేవతకు
రాజచ్ఛత్రమది
మలిదేవి ఒడ్డు రావిచెట్టు
మా ఊరి సా రక సామ్రాజ్యానికి
సమ్రాట్టు
దాని సెలవు తీసికొని వచ్చేస్తాము
సర్వభక్షకునికి నర భోజన మర్పించి
(13-8-'77, నెల్లూరు)

# మైలురాయి

రస్తా ప్రక్క ఒదిగి నిలబడి
దూరాన్ని కొలిచే మైలురాయి
కదలక మెదలక కండ్ల ఎదుట
జరి, రాక పోకల గమనిస్తుంటుంది
ఏకాంతముగ ఎప్పుడు వుండదు
వచ్చేవారి పొయ్యేవారి గల గలలు
దినమంతా సంవత్సరము పొడుగునా
చెవియొగ్గి ఆలకిస్తు ఉంటుంది
తుపానురాని జడివానలు రాని
వానలులేక క్షామదినాలు రాని
కృత్తిక రోహిణి కార్తుల కాలం రాని
మైలురాయికి అంతా సమానమే
అన్నిటినీ సమ దృష్టితోనే చూస్తుంది
చూస్తూ వుంటుంది అన్నిటి మధ్య
నిలిచే వుంటుంది స్థితప్రజ్ఞుని వలె
ఏదీ పట్టిచ్చుకోదు ఏదీ అంటించుకోదు
నిర్లిప్తతతో వుంటుంది

## 2

ఎండాకాలము- కుక్క చాపిన
నాలుకవలె వున్నది రస్తా
రాత్రి అనక, పగలనక
పోతూ వుంటుంది రస్తా
ఎక్కడ బయలుదేరి
ఎక్కడికి పోతుందో రస్తా
సడలని పట్టుదలతో తీవ్రమైన కోరికతో
వెడలే అభిసారిక వలె వున్నది రస్తా

ఏ సంకేత స్థళానికో తెలియదు
ఏ వలపు పిలుపో తెలియదు
ఏ వేణుగానము వింటూ పోతుందో
వినరాని అందియ గజ్జెల మ్రోత చేస్తూ
పోతుందో ఎవరికి ఎరుక

ఆ రస్తా కాపలావారి నాయకుడుగ
ఉన్నది ఆ మైలురాయి
రస్తాకు మైలురాయికి ఏనాటి సంబంధమో
రెప్పలు వాల్చక వీక్షిస్తూ వుంటుంది రాయి
'పా జరుగు' అంటుంది రస్తా
కదలికనే ఆనతిస్తుంది రస్తా
పయాణానికి కదలికకు
స్థానము సంకేతము రస్తా
నిత్యచలనాన్ని గమనించే
అచల కిశోరుడు ఆ రాయి
నదీ పవాహాన్ని చూస్తు
అలరే అశ్వత్థ వృక్షము ఆ రాయి
ప్రయాణి జపమాలను త్రిప్పు
నిశ్చల మునీశ్వరుడు ఆ రాయి
ఒకటి నిశ్చల స్థిరత్వానికి చిహ్నమైంది
మరియొకటి నిత్యచలనానికి సంకేతమైంది
ఒకటి తరుశాఖలుగ,
శాఖాపుష్పసౌరభాలవలె ఉంటే
తరుమూలశకలముగ, ఇంకొకటుంటుంది
బండిఇరుసు చక్రమువలె
ఒద్దిగ్గా వుంటుంటాయి
చలనానికి కొంత స్థిరత్వము కావాలె
స్థిరత్వానికి కొంత చలనము రావాలె

మైలురాయే లేకుంటే
రస్తాకు తెలియదు నిజ ఔన్నత్యం
జీవితములో జన దినమువలె
రాయి కొలుస్తుంది రస్తా పొడువును
రస్తా అందాల చూపుటకు
రాయి అద్దంవలె తోస్తుంది
రాయి లేకపోయినా రస్తా నడుస్తుంది
అద్ధం లేకపోయినా
సుందరి ముఖం దీపిస్తుంది
ముఖతిలకానికి అద్దం కావాలె
ఆత్మానందానికి విశ్వాసానికి
సంతుష్టికి అద్దం కావాలె, రాయి కూడ అంతే రస్తాకు

**5**

చీకటి వానలో పోతూ ఇద్దరు స్నేహితులు
మైలురాయిని చూచారు
మూడు మైళ్ళు వచ్చేశాము
అన్నాడొకడు ఆనందంగా
అబ్బా, నాలుగు మైళ్ళు పోవాలింకా
అన్నాడు ఇంకొకడు విచారంగా
ఒకడికి ఆనందాన్ని, ఇంకొకడికి విచారాన్ని
కలిగించింది ఒకే సమయములో ఆ రాయి
దూరాన్ని సమీపాన్ని వ్యక్తంచేసే అర్ధనారీశ్వరుడు
అట్టి మహత్తరశక్తి వుంది ఆ రాయికి
కాలానికి గంటమాదిరి గమనానికి కావాలె మైలురాయి
అదే దాని మానదండం
అర్థాన్ని ప్రకటించే వ్యాఖ్యానం
సౌందర్యాన్ని మెచ్చే రసికత్వం
(6-10-77, నెల్లూరు)

# రేడియో

వార్తలు విని రేడియోను ఆర్పేశాను
రేయి చీకటి సందడి లేకుండా వుండింది
నా చిన్న గదిలో అంతా నిశ్శబ్దం
తోడనే జ్ఞాపకానికి వచ్చింది
నా గదిలోనే అనేక వాణులు విహరిస్తున్నాయి
ఢిల్లీ, బొంబాయి, కలకత్తా వాణులే కాక
లండన్, టోకియో, సింగపూరు వాణులు
నా గదిలోనే వున్నాయి ఓపికవుంటే తోడనేవినవచ్చు
మాటో పాటో, జంత్రసంగీతమో
నాటకమో, కవ్వాలియో వినవచ్చు
దూర సుదూర ప్రాంతాలనుండి
వాయు తరంగాల వేదికపై నృత్యం చేస్తూ
అదృశ్యవాణులు నా గదిని అంతా మూగాయి
బయలుదేరడం, గమ్యస్థానాన్ని చేరడం
ఒకేసారిగ మనోవేగంతో వస్తాయి
నా గదిలోనే కాదు ప్రపంచమంతా
కొండలపైన, సముద్రాలపైన, ఎడారుల్లో
పట్టణాలలో, ప్రతి సందులో, ప్రతి ఇంటిలో,
అన్ని గదులలో, పల్లెసీమలలో పొలాలలో
ఒకేసారి క్రమ్ముకొని, సంసిద్ధముగా వున్నాయి
పలకడానికి, వినిపించడానికి.
ఇన్ని వాణులు విహరిస్తున్న నా గదిలో
అంతా నిశ్శబ్దం అనుకోవడం భ్రాంతికాదా?

## 2

ఈ వాణులు నిశ్శబ్దపు ముసుగును వేసుక వచ్చాయి
నోరు బిగించుకొని రివ్వున వచ్చాయి

కంఠాలు పోయిన వాణులుగ
శరీరములేని తపస్సుగ
ప్రాణములేని చిత్రముగ
చలనములేని వాయువుగ
దేహము లేని, జీవము పొందిన ఆత్మగ
చేరాయి నా గది అంతా
ఉత్తర, దక్షిణ, తూర్పు, పడమర దిక్కులనుండి
బయలుదేరిన వాణీభరిత వాయుతరంగాలు
సమావేశమై యున్నాయి నా గదిలో
ప్రపంచములోని అందరి గదులలోను
రేడియోవక్షాన్ని గిలిగింతలు పెట్టుచు వేచియున్నాయి
కవాటాలు ఢీకొంటూ తెరవమని వేడుచు న్నున్నాయి
నిశ్చలుడై రేడియోమహాశయుడు మౌనంగా వున్నాడు
హృదయం కరిగి జాలినొంది తలుపులు తెరిచాడు
ఒకసారి ఒక వాణినే రమ్మని పిలిచాడు
మిగతా వాణులన్నీ, కన్నులు లేని చూపులతో
తమకేమైన అవకాశమున్నదేమో యని
ఎదురు చూస్తూ వుంటాయి
అప్పుడప్పుడు రెండు వాణులు పోటీపడుచు
నావంతు నావంతు అంటూ కితకితలాడుచునుంటాయి
ఒక్కొక్కసారి గరగరలాడుచు
రోషంగా పలుకుతుంది ఆ వాణి

విజ్ఞాన తపస్సుచే సాధించాము
దూరశ్రవణ శక్తిని మనమంతా
ఆధునిక ఋషులము మనమంతా
ఆకాశాన్నుంచి దిగివచ్చిన వాణికాదు
ఆకాశానికి పైకి ఎగిరే వాణి యిది
మన మాటల పాటల విని

ఈర్ష్యపడుతారు రంభ, ఊర్వశి, మేనకలు
భూమినుండి ఆకాశానికి వార్తల అందిస్తుంది
అచ్చటి మాటల ఇచ్చట పక్షులు వినిపిస్తున్నాయి
ప్రస్తుతము అర్థంకాని మాటలే అవి
భూలోకవాణిని వారు కనిపెట్టినపుడు
గ్రాహ్యము కాగలవు ఆ పాటలన్నీ
అట్టి విభిన్న భావధూమ గోపురాలపై ఎక్కి
నిద్రాగగనాన్ని చేరుకొన్నాను
అశరీరవాణీ సంభరితమైన
నా గదిలోని నీరవత
మూగగ రేడియోను కౌగలించుకొని
రాత్రంతా మేల్కొనే వుండింది.
(9-10-77, నెల్లూరు)

## పత్రిక - రేడియో

పత్రిక అక్కా, పొద్దున్నే వస్తావు
బరువైన ముస్తాబుతోనే వస్తావు
దేశంలోని ప్రపంచంలోని విషయాలన్నీ
సంగ్రహించి, వార్తలక్రింద ఇస్తున్నావు
రకరకాల ప్రకటనల దుప్పటి కప్పివస్తావు
క్రీడారంగం, విజ్ఞానయుగం మహత్తులను
బొమ్మలతో చేర్చి, ఇస్తుంటావు
పెద్ద పెద్ద వ్యాసాలు ప్రధాన వ్యాసాలు
అన్నీ అందంగానే వుంటాయి
కాని నీ వార్తలు తాజాగా వుండవు
నేను రాత్రి చెప్పిన వార్తలే నీవు చెప్పుతావు
చలిది అన్నం తిన్నట్లు
వాడిన పూలవాసన వలె
ఉంటాయి నీ వార్తలు,
పేరేమో వార్తాపత్రిక
కాని వార్తలు పాతవే అని అన్నది రేడియో

**2**

పత్రిక సన్నగ నవ్వి నిజమే నిజమే
నీవు దినానికి ఆరు తూరులు చెప్పుతుంటావు
నేను నీ మాదిరి వాగగలనా?
నీవు శరీరము లేనిదానవు
కంఠం మాత్రం వున్నది అరుస్తుంటావు
నేను నెమ్మదిగా అన్ని హంగులతో రావాలె
వస్తే వుంటాను, శాశ్వతంగా వుంటాను
నీవు మెరుపువలె మెరసి మాయమగుతావు
నాతో నీకు పోలికెక్కడిదే అన్నది పత్రిక

## 3

పెద్ద సంగతి జరిగినప్పుడు
తోడనే ప్రజలకు చెప్పాలె
నిర్ణీత సమయంలోనే వచ్చి చెప్తానని
భీష్మిస్తే కాలం నీ కొరకాగదు
అందరికీ ఒకేసారిగ చెప్పాలె
నీవు పట్టణాల్లో ప్రొద్దున్నే
పల్లెలకు మధ్యాహ్నం సాయంత్రం
చెప్పుతావు. రూపం లేకపోయినా
వేగంతో అందరినీ వశపరచుకొంటాను
నన్ను అర్థం చేసుకోవడానికి
చదువు అక్కరలేదు
పిల్లలు పెద్దలు, చదివినవారు
చదవనివారు, నాదగ్గరకొస్తారు
అన్నది రేడియో హేళనగ

పత్రిక గంభీరంగా, వార్తాసమయానికి
ఆఫీసుకో బజారుకో వెళ్తే ఏ మగుతుంది?
టెలిఫోను వస్తే, పిల్లలు అల్లరిస్తే
స్నేహితుడొచ్చి పలకరిస్తే
నీ వార్తలు వినేదెట్లా?
అశ్రద్ధగా వింటే వార్తలు జరిగిపోతాయి
మళ్ళా వినలేము కాలం మాదిరే
అనుక్షణము కదలిపోతూ వుంటావు
ఆ సమయంలోనే వినాలె శ్రద్ధగా వినాలె
నేనట్లా కాదుగా! ఇష్టం వచ్చినప్పుడు
చదవొచ్చు, మరలా చదవొచ్చు
వారం తర్వాత మాసం తర్వాత చదవొచ్చు
రైలులో చదవొచ్చు, భోంచేసి చదవొచ్చు

నిద్రలేసి చదవొచ్చు, సంపూర్ణ స్వేచ్ఛ
నీ గొడవది కాదుగా
నీకు బానిసయై, నీ సమయానికి
కాచుకొని, నీవు పలికినప్పుడే వినాలె
ఇష్టమున్నా లేకపోయినా
నీవు చెప్పిందంతా వినాలె
విమర్శలు, వాగ్దానాలు, నాయకుల ప్రగల్భాలు
క్రీడాఫలితాలు, తోష్టాలు వినాలె
స్వేచ్ఛ పోగొట్టుకొని, నీకు దాసుడై
నీ సమయానికి శ్రద్ధగ వినాలె
నన్ను చదివేటప్పుడు, ఇష్టం లేనిది
వదలొచ్చు. ఇష్టమున్నది
ఇష్టము వచ్చినప్పుడే
మరలా మరలా చదవొచ్చు
అని అన్నది పత్రిక

**5**

పాటలు నాటకాలు రేడియోలో విని
వార్తలు పత్రికలో చదవడమే
మెరుగని తోచింది.
పత్రికకు రేడియోకు ఐకమత్యం కుదరాలె
అనే మౌననినాదాలను
కల్పనాకర్ణాలతో వింటూ
నిట్టూర్పు విడుస్తూ, దుప్పటి కప్పాను.
(21-10-77, నెల్లూరు)

# జనవరి

వాతావరణం ప్రశాంతంగా వుండింది
సాగరం సామ ంగా ఊగుతూంది
మామూలుకన్న నిదానంగానే వుండింది
తరంగాలు బడలికగ లేస్తుండినాయి
ప్రయాణానికి అనుకూలమని
కర్ణధారి తలచాడు
త్వరలోనే అందరు మూగారు
దండయాత్రకు బయలుదేరింది పడవ
నావికుడు వుత్సాహంతో చుక్కాని పట్టాడు
అంతా సుముఖంగా వున్నది, గమ స్థానాన్ని చేర్తాము
సురక్షితంగా గెలిచి వస్తాము అని నవ్వుచు అన్నాడు
పడవంతా జనము, ఎక్కడ లేని కోలాహలం
ఎక్కడ ఏమి విషమించిందో
సౌమ్యప్రశాంతతకు భంగం కలిగింది
సాగరస్తబ్దతలోనే హాయినికూర్చే మారుతాలు
పొదుగుచు వచ్చాయి ప్రచండ ప్రభంజనాలను
బడలిక మాటున తరంగాలు
సమర సన్నాహాలు చేశాయి
ఒళ్ళంతా కాళ్లువేసి ఎగరడానికి పూనాయి
సరళ సౌమ్యంలోనే దిగాయి యుద్ధశిబిరాలు
అంతా ప్రవంచనే, అంతా భ్రమే
నాలుకమీద నర్తిలి ఉపశమించే
విద్రోహం అణచిపెట్టిన
సర్పమువలె హృదయ వల్మీకములో దూరి
బలాన్ని పెంచుకొని, అనువగు కాలములో
కాటువేయ వేచి ఉంటుంది

---

* 1977 సం॥లో జనవరి 18 వ తేది పార్లమెంటు ఎన్నికలని ప్రకటించారు.

సముద్రములోని పంచభూతాలు కాచి ఉన్నాయి
పెద్దతుఫాను వడివడి గాలులు
పైపైకి ఎగిరి దుమికే అలలు
చురుకైన జల్లులు, అంతా తిమిర బంధురము
తెరచాపలు చినిగాయి
చుక్కాని చేతినుండి జారింది
హాహాకారాల మధ్య పడవ బోర్లపడింది
జనమంతా అలలలో తేలుచు మునుగుచుమడిశారు

ఎన్ని సువర్ణ మనోరథాలు
ఎన్ని విజయకాంక్షలు
ఎన్ని రాజ స్వప్నాలు
అంతమొందాయి పడవ మునకతో.
బడబానల శిఖలే
జ్యోత్స్నా హస్తాలై పిలిచాయా
సౌధామినీ లతలే
స్నిగ్ధ దీప్తులతో రమ్మన్నాయా
సరళ తరళ తరంగాలు
గల గల నవ్వుచు సైగలు చేశాయా
ఊరి భుజాల ఎక్కి మందసమీరాలు
వింజామరల వీస్తూ ఆహ్వానించాయా
ఆ పిలుపుల పసిడి పలుకుల వెనుక
దాగి వున్నాయి గుప్త విషదంతాలు
అమృతము ఆశపట్టి
మోహిని హాలాహలాన్నే పంచిందా
మయసభలో వలె మాయాదృశ్యాలా
మెరుపుల మేడల్లో పిడుగుల రణదుందుభులా
కలలు కన్న విజయమాల
ఉరిత్రాడై గొంతు పిసికిందా
కాలము వక్రింప సౌభాగ్యరేఖ చెదిరింది
ఎరవందనే వల ఉచ్చులు వున్నాయి

నీళ్ళల్లో సుడిగుండా లున్నాయి
ప్రహ్లాదుడి వెనుకనే నరసింహుడు వేచివున్నాడు
జూదపు ఆటల మైమరపులలో
రాజ్యం పోయింది, ద్రౌపది మానము పోయింది
తలచింది ఒకటి, జరిగింది వేరొకటి
సంకల్పము ఒకరిది, సిద్ధి మరొకరిది
ఎన్నికల నిర్ణయం ఒకరిది, రాజ్యాంగం మరొకరిది
ఆకాంక్షల తెర వెనుక
ఎన్నెన్ని విచిత్ర సంఘటనలు
ఎన్ని స్వప్న సౌధ శిథిలాలు
భగ్నహృదయ శకలాలు
ఆశాపర్ణకుటీరాలపై
అశని పాతాలు
ఉత్తర ముఖంగ ప్రవహించే అదృష్టవాహిని
హఠాత్తుగ వెనుతిరిగి దక్షిణ ముఖం పట్టింది
సభా ఉద్యోగపర్వ ఊహలన్ని
మృగతృష్ణలై మోసగించాయి
అరణ్యపర్వానికి బాటలు వేశాయి
అధికార కిరీటాలు అస్తమించాయి
విచారణ కంటకాలు దారి పొడుపున వెలిశాయి
(12-1-78, నెల్లూరు)

# మూగ కోకిల

ఈ దీపావళి రోజున
మబ్బులు గుడారాలు వేశాయి ఆకాశంలో
తెరవెనుక దాచేశాయి
సూర్యదేవుని వెలుగును
సాయంత్రము చేరాయి
పక్షులన్నీ వకుళ వృక్షంలో
కలకల ధ్వనులతో
అవికూడ దీపావళి జరిపాయి
మనము చీకటిపోయి
వెలుతురు రావాలని కోరుతు
మతాబులు కాలుస్తుంటే
అవి వెలుగు పోయి
చీకటి కావాలని కోరుతు
పాట ప్రార్థనలు చేశాయి కాబోలు
వకుళ వృక్షానికి
అమావాస్య తిమిరాలను పిలిచాయి
కాని మొన్నటిదాకా
తోటనంతా అలరించే
కోకిల జంట రాలేదు
వసంత గ్రీష్మాలలో
కూయుచుండిన కోయిలలు
నేడు దీపావళి పండుగకు రాలేదు
పండుగ వెలితిగా వుండింది
మధురవాణి విహంగరాణి
లేని కొరత బాగా కనిపించింది
ఎచ్చట వసంతాన్ని వెదకుచు వెళ్ళాయి
ఏ గ్రీష్మపు వెచ్చని వెలుగులో
ఈదుచు వెళ్ళాయి
పాటలు లోపించినా

మూగబోయిన పక్షులుకూడ లేవే
ఏ కొండలకు, ఏ అడవులకు
పరదేశాలకు, పోయిన పాటను
వెదకుచు వెళ్ళాయో
చిత్రం ఈ అదృశ్యం
మరలా చలికాలము పోయి
ఫాల్గుణమాసం రాగానే
మామిడి చివుళ్లు కనబడగానే
దక్షిణ సమీరాలు పిలిచినట్లు
హృదయంగమమైన
పంచమ స్వరాన పాడుకొంటూ
వచ్చి చేర్తాయి
అంత తియ్యని కంఠం
ప్రకృతిలో లేదు దేనికీ
అది రమ్యంగానే వున్నది
కాని ఏడెనిమిది మాసాలు
మాయమై ఎక్కడికి వెళ్ళాయో
ఏ దిగంతపు అంచులకో
ఏ అడవుల ఒడిలోకో
ఏ సరముల ఒడ్డులకో
(11-11-77, నెల్లూరు)

# ఉప్పెన*

స్థిమితంగ సౌమ్యంగ వుంటుంది ప్రకృతి
సరళంగ శాంతంగ వుంటుంది
సీమల అనుశాసనములోనే వుంటుంది
నదులకు చెరువులకు కాలువలకు
గట్లున్నాయి
విశాలమైన గంభీరమైన సముద్రానికి
లేవు గట్టులు
తన పరిమితిలోనే ఉంటుంది
ఆటుపోటుల ఆనల వహించి ఉంటుంది
నిగూఢమైన క్రమశిక్షణకు లోబడి ఉంటుంది
కాని కాలగతిలో ఎక్కడో తొట్రుపడుతుంది
కాలు జారిపడి తెప్పరిల్లుతుంది
కొంతసేపు అలజడి చెందుతుంది
అరుస్తుంది తల్లక్రిందులు చేస్తుంది
భీభత్సం చేస్తుంది ప్రళయచ్ఛాయల చూపుతుంది
మరణ శిబిరాలను వేస్తుంది
మరణాభాసను ప్రదర్శిస్తుంది
వక్రించి వికట నృత్యం చేస్తుంది
విపులవదన గహ్వరాన్ని తెరుస్తు
గాండ్రించి పైకి లేచి గంతులు వేస్తుంది
అంతా కొన్ని గడియలలోనే
విస్తరించిన దేహ కందరాలను
కుంచించుకొని ఇముడ్చుకొని
యథారూపం తాలుస్తుంది
తిరిగి సౌమ్యంగానే కనబడుతుంది
ఏమిచేసి పోతుందో మరుస్తుందా?

---

* నవంబరు 19, 1977 దివిసీమలో ఉప్పెన.

ధ్వంసమైన భగ్నమైన వీథులలో
తిరిగి పోతుంది
శవతోరణాల మార్గంలోనే పోతుంది

## 2

తాత్కాలిక వునాదము ఎందులకో
సర్వవినాశకాంక్ష యెందులకో
కుపితయై మండే ఆగ్రహము యెవరిమీదనో
రుద్రపక్షముల విప్పి చీత్కారాల చేస్తుంది
భీభత్స నినాదాలను కలిడుచు
శ్శాన దృశ్యాలను చూపెడుతుంది
ప్రళయాగ్ని కీలలను ఎగజిము తుంది
ఇంతకాలము యౌవనశక్తిని బలాన్ని
ఎట్లా అణచి దాచి వుంచిందో
బ్రహ్మాండాన్ని అండములో ఇమిడ్చిందా
వటవృక్షాన్ని బీజములో దాచి వుంచిందా
మహాసింధువును బిందువులో అమర్చిందా
అణచిపెట్టిన శక్తి విజృంభించింది
అణువు చిట్లి అణుశక్తి చెలరేగింది
మందమారుతాలు ప్రచండ ప్రభంజన
పక్షాలయ్యాయి
స్వల్ప అల్పవీచికలు
తాళవృక్ష శిఖరాలను తన్నాయి
భీషణ ఉత్తుంగ తరంగాలై దుమికాయి
ప్రశాంత నీరాలు నీరదాలను అంటాయి
ప్రకృతిలోని వామన రూపము
త్రివిక్రమరూపం తాల్చింది
ప్రకృతిలోని అంతర్గర్భిత శక్తి
ప్రళయ వాహ్యాళికి బయల్వెడలిందా
శ్శాన గంధాలను పీల్చుట వెడలిందా

దేవేంద్రుని ఐరావతానికి మదమెక్కిందా
వజ్రాఘాతానికి లొంగక
తిరగబడి వురికిందా
ఎక్కడ ఏమి విపరీతము జరిగిందో
దేశానికి విపత్కరమైన ఉపద్రవమే జరిగింది
ఇలలో శకుంతలకు జరిగిన అన్యాయానికి
తల్లి మేనక కటు వచనాలతో శపించిందా
భూదేవికి నష్టము కావాలని కోరుతు
దేవేంద్రుణ్ణి కొలిచిందా
వరుణ వాయుదేవుల ఉసికొల్పిందా
పులకోల్లాసినియై ఊర్వశి
లలిత లాస్యము చేస్తు
పురూరవుని తలుస్తు
అన్యమనస్కయై ప్రణయావేశయై
విలయతాండవము చేస్తు
విలోల కల్లోల నృత్యభంగిమల చూపిందా
మబ్బుల చెరలో సూర్యుణ్ణి బంధించి
అకాల తిమిరాలను కల్పించి
వర్ష వాయుదేవుళ్ళు
చీకటి దొంగలవలె
దోపిడికై ధరణికి బయలుదేరారా
ఇల్లు కూలనేసి పైరు పంటల పాడుచేసి
నరపశు శవాలభక్షణకై
రాబందులవలె మూగారా
అంతా విపరీతమే అస్తవ్యస్తమే
వక్రతే కుటిలతే క్రౌర్యమే

ఎన్నెన్ని విలాపాలో ఎన్నెన్ని హాహాకారాలో
కళ్ళ ఎదుటనే ఉబుకుచున్న నీళ్ళల్లో
ఎన్ని సజీవ జలసమాధులో
కన్నుగానక గాలిపడగొట్ట
నీళ్ళ అలలు యీడ్చుకొని పొయ్యాయో
అన్యోన్య సహకారంతో తోడుదొంగలవలె
నీరు గాలి నరలోకానికి
దాడివెడలాయా దోపిడికై వచ్చాయా
ఇళ్ళన్ని పడిపోగా
రోళ్ళు మాత్రము మిగిలాయా
గ్రామశిథిల అవశేషాలుగ
పాడువడిన గ్రామ అస్థికలా
ఉప్పెన పెనుగాలులు
చెట్టు తలల అంతే అలలు
వానజల్లులు విసిరే బాణాలు
చీకట్లో కడలి వింత కాంతులు
ప్రళయకావ్యానికి భూమికగ
ఇలా రాజ్యంలో వెలిశాయి
మహాభీభత్సం దారుణమారణ యజ్ఞం
తిమిర దుఃస్వప్నం సంహార తాండవం
ప్రభంజమని ప్రమత్త వుద్రేకం
వరుణుని విలయ విలాసం

30-12-77 నెల్లూరు.

## ఓ ఎ ఆ కు

తిరుగ నవంబరు వచ్చింది
ఆంధ్రలో తుఫానులన్నీ
ఈ నెలలోనే చెలరేగాయి
కోస్తాజిల్లాలకు సంకటాలను
కురిపించే మాసము నవంబరు
వాయు తరంగాలు ప్రళయ నృత్యం
చేస్తూ వచ్చాయి
దీపావళి పిదప రుద్ర దీపావళి
జరుపుతు వస్తాయి
కడలి అలలలో అలజడి కలిగించి
పల్లవి పాడుతు వస్తాయి
తరుశాఖల పత్రాలలో
చరణాలకు తాళమువేస్తూ వుంటాయి
. చెట్లకు శివమెక్కి
ఒడలంతా ఊపుచు
గజ గజ వణకుచు నిలుచొని ఉంటాయి
పక్షులు దిక్కులేని బిడ్డలవలె
చెట్లనిపట్టి చలిచావుకు
ఎదురు చూచుచు వుంటాయి
ఆకాశము భూమిపై దండయాత్ర
చేస్తున్నట్లుంటాయి గాలులు, వాన జల్లులు
ప్రభంజనుని చిరయౌవన శక్తి ఎంతో
ప్రదర్శించే తరుణమది
వాయువు కండరాలను చూపే
వి ష అవకాశమది
ప్రశాంతముగ నుండిన జలాలు
ఊత్తుంగ తరంగాలుగ యెగురుచు
తమ ఔన్నత్యమెంతో చూపుచున్నాయి

అన్నీ త్రివిక్రమ రూపాన్ని
చూపాలని కోరుచు ఉన్నాయి

## 2

రావిచెట్టు పైకొమ రెమ లలోని ఆకు
నిరుత్సాహపడక
తోడి ఆకుల చేయూతతో
ఎదురొడ్డి రొము విప్పి నిలిచింది
చాలకాలము లొంగక నిలిచింది
తుఫాను గాలుల తాకుడుకు
వానజల్లుల అంబుల ధాకకు
తలతో, రొము తో, కాళ్ళతో
ఝంఝా దేహమును ఢీకొంటూ
పోరు సల్పుతు వచ్చింది
తుపాను కూడ ఆకుల పొగరును
హతమార్చవలెనని పట్టు బట్టింది
వాయుదేవుడు వర్షదేవుడు
మెరుపు నవ్వుల అట్టహాస్యము సల్పుచు
చుట్టుముట్టి సమరము జరుపుచు
లొంగదీయవలెనని దెబ్బలు కొట్టుచు
పోరు సాగిస్తూనే వున్నారు

అసమానులమధ పోరాటం
ఆకాశపు శూన ంలో జరి౹ పోరాటం
గగనవేదికపై జరి౹ కుస్తీ
పద వ్యూహంలో అభిమన్యునివలె
పోరి పోరి, అలసి సొలసి
భూతలమునకు వాలి
చావును రమ ని పిలిచింది

కొన్నాళ్ళకు చీకి మురికి కాల్వలో చేరింది
మొన్న మొన్న తుఫాను దెబ్బలకు
రోము  చూపిన ఆకు
మురికి కాల్వలో కుళ్ళింది
రావిఆకు జీవితములో స్వర్ణాధ్యాయము
ఆ అసమాన గగనసమరం
లొంగక భీతినొందక వీరునివలె
మరణానికి తయారైంది
దీర్ఘముకాని పత్రపరమాయువులో
వాయుదేవుడితో జరిపిన
పోరాటపు గడియలే
సువర్ణఘట్టాలు
వీరునివలె పోరాడి
వీరునివలె సమసింది

22-11-77 నెల్లూరు.

# జనవరి 2

మరల వచ్చింది జనవరి 26
రాజుల వదలి ప్రజారాజ్యం అయిననాడు
ఎన్ని ఆకాంక్షలు, యత్నాలు, తా గాలపరిణామమో
ఎందరి నిర్విఘ్న తపస్సుల ఫలితమో
సిపాయిల ఆవేశములో గతశతాబ్దంలో
నాటినబీజము పండింది
వంగవిప్లవకారుల రాత్రి జాగరణాలకు
అరుణోదయమైంది
సీతారామరాజు ఉహాభ్రమరాలు తేనెవాకల నిచ్చాయి
సవర్కరు భగత్‌సింగుల మనోరథాలు సిద్ధించాయి
గాంధీమహాతు ని శంఖారావము
మిన్నుల మారు పలికింది
అసహాయోద్యపు కఠిన వ్రతాల చేలు పండాయి
అజ్ఞాతవీరుల గ్రామీణమహిళల సేవలు ఫలించాయి
జైళ్ళలోని కష్టాలే చిరునవ్వులు నవ్వాయి
ఉరికంబాల చావులే పునాదిరాళ్లు అయా యి
వందేమాతరం భారతమాతాకీ జై నినాదాలే
వీరోచిత మంత్రాలయ్యాయి

## 2

జనవరి 26 వెనుక ఎంత దీక్షాచరిత్ర,
సంకల్ప తపస్సు
ముకుళించుకొని దాగియున్నది
దాస్య అమావాశ్యాదినాలు, రాజుల నిరంకుశాలు
అస్తమించిన దినమది
జైలులోనున్న వారికై ఎందరు తల్లులు భార లు
అశ్రు అర్ఘ్యాల నొసగిన సవితృని అరుణోదయమది
జ్ఞాత అజ్ఞాత వీరులు కారడవులలో మారువేషాలతో

తిరుగుచు పాము పడగనీడలలో శయనించారో
పోలీసుకన్నుల ఏమార్చి కందమూలాదుల తింటూ
కారుచీకట్లలో మేనుతాల్చిన సంకల్పాలై విహరించారో
రాట్నాలు త్రిప్పుచు గీతలు చదువుచు
సత్యాగ్రహ శక్తిని పుంజుకొన్నారో
దండి ఉప్పుయాత్రలో దేశదీక్షను పెంపొందించారో
జలియన్‌బాగు దురంతాలచే గుండెల రాళ్ళుచేసి
ఎందరు స్వాతంత్ర్య సమరానికి ఉరికారో
నిషిద్ధమైన ఉప్పుపంటచే ఎంతమట్టి
వీరదుందుభియై రుద్రవీణయై
సత్యాగ్రహ శ్రావ్యతల వినిపించాయో
మారుమూలల్లో రివాల్వర్ల బాంబుల సన్నాహాలు

## 3

కౌన్సిల్లో దాదాభాయి గోఖలేల ఉద్రేక భాషణాలు
స్వరాజ్యం నా జన్మహక్కని
చాటిన తిలక్కు కారాగారవాసాలు
సభలలో మాలవ్యా రాజాజీ పట్టాభిల
జనుల లేపి ఊపే ఉపన్యాసాలు
మోహన్‌దాసుని జవ్హరలాలుని దేశభ్రమణాలు
నేతాజీ విదేశ సమర సన్నాహాలు
మహిళల ప్రభాత ఫేరీలు సత్యాగ్రహుల పికెటింగు
శిబిరాలు
కారాగారవాసాలు ఉపవాసాలు
అన్నిటి మేళవింపే మనస్వరాజ్య శారదలకి
పసిడికలల మూట నోముల పంట
వ్రతాలసిద్ధి మనస్వాతంత్ర్యలబ్ధి.

కారాగారాలలో సత్యాగ్రహులు
పలు ఇడుములకు లోనయా రు

మామూలు ఖైదీలతో సహనివాసం
మార్పులేని తిండి చాలనిబట్ట
కఠినమైన పడక మొరటు కంబళ్లు
దీపాలులేని గదులు కోరిన లక్ష్యాలయ్యాయి
స్వరాజ్యాన్ని కోరేవాళ్ళము
జైలుకు కొనిపొండని కోరేవారు
లాఠీచార్జీలు పరిపాటైన రోజులవి
జైలు కొరడాదెబ్బల శిక్ష పొందినవారున్నారు
జైలులో గర్భస్రావములైన తల్లులున్నారు
పుట్టిన బిడ్డలున్నారు
తల్లి చనిపోయినా భార్య చనిపోయినా
విడుదల కోరని ధీరులెందరో వున్నారు
ధనాభావముచే కుటుంబమంతా
కష్టాలకులోనైనా చలించని దేశభక్తులున్నారు
నిరాహార దీక్షలు వరుసగ జరి‹ వి
పంచసత్యాగ్రహాల వుద్యమ పర్యవసానం
మనస్వరాజ ం. త్యాగఫలమది
ఏ యుగ చరిత్రలోను దేశచరిత్రలోను
కాన్పించని త్యాగపటిమ మహిమ
ఏ మహాకవి ఊహించని దీక్షాప్రదర్శన
హింస ఎరుగని సమరమది
దెబ్బలు తినుటేగాని కొట్టుట తెలియని పోరు
నెత్తురు కన్నీరు చెమటల సంగమ స్రోతము
మన స్వంతం త వాహిని
పెక్కు ఉత్సాహాల ఉద్వేగాల ఆక్రోశాల
సమ్మేళన మన విజయ మంత్రనినాదము
కోటి భావనదీ ప్రయాగ
మనస్వరాజ తీర్థధామం
దేశమంతా ఏకతపస్వియై చేసిన
తపోవృక్ష ఫలసిద్ధి

శతకోటి వీచికల జనార్ణవ సంజాతము
శతసహస్ర సంకల్పమయూఖపుంజము
స్వాతంత్ర్య భానునిదీప్తి
పెక్కువాడిన తునకలప్రోది
ఛిన్నభిన్న రాజ్యశకలాల సముచ్చయము
ఐక్యతాసూత్ర నిబద్ధమైంది
త్యాగాగ్ని తప్తప్రపూతమైంది
అంహిసాసత్యాల ఆధారాలపై స్థాపితమైంది

## 5

ఆదినుంచి చరిత్రను నింపిన
చక్రవర్తులు రాజులు సామంతులు
పాళేగారులు దండనాయకులు
ఎండాకాలపు తెల్లమబ్బులవలె
చరిత్ర తిమిరగర్భంలో కలిసిపొయ్యారు
రాజరహితదేశమై గణ తంత్రస్వామికమై
ప్రజాప్రతినిధులే పరిపాలకులై
దీక్షామంత్రముచే దేశాన్ని మార్చివేశాము
సింహాసనాల కథల చీకట్లపై వెలుగుతెరను దించాము
యుగపరివర్తనచేసి నవయుగాన్నే స్థాపించాము
రాజాధీన దాస్యదేశము ప్రజాతంత్ర వాయువుల
పీల్చింది
వయోజన ఓటింగ్ వచ్చి
ప్రజలందరిని సమానాధికారుల చేసింది
ఎడారులు సస్యశ్యామలమయ్యాయి
బీడులునందన వాటికలయాయి
భాషాగంగ పండిత హిమాద్రులదాటి
అందరిలోయల చేరింది
నవవసంతం నిత వసంతం
జనహృదయపు తోటలచేరింది

వెయ్యిరంగుల పూలు అలంకరించాయి
అట్టి మంగళ పర్వదినము జనవరి 26
దీర్ఘప్రయాసల పర్యవసానము జనవరి 26
దీక్షాశిఖరము, త్యాగపూజాలతాంతము
దేశపతాకము మిన్నుల గిలిగింతల పెట్టిన నాడు
మన రిపబ్లిక్ డే పండుగ జనవరి 26

నెల్లూరు, 24-3-78.

## అంబేద్కర్

"ఏవా దైన్యముఖాల చూచి
కరుణాభరిత స్వరాలు విని
నా హృదయం తరుక్కుపోతుంది
యుగయుగాల నుండి
తలపైపడే అవమానభారం క్రింద
అజన నిస్సహాయతను
మూల్గుచూ సతమతమగుచు
అనివార్యమని తలవ్రాతయని సరిపెట్టుకొనుచు
కాన్పించని సంకెళ్ళనే ఆశ్లేషిస్తూ
సిగ్గుచేటని తలచక జీవిస్తుంటే
నా హృదయం బ్రద్దలగుతుంది
గర్భకోశంలోనే చచ్చుంటే
పుట్టకమునుపే మడసుంటే
ఎంతో బాగుండేది దీనికి మారుగా
కష్టాల దరిద్రాల బానిసత్వాల
పరిస్థితిని మరింత దైన్యముగ
మీ హేయమైన దయనీయమైన
దుఃఖభాజనమైన జీవితాలతో
చేస్తున్నారు. మీరు చస్తేనే మంచిది
మేల్కొని నూతన జీవితాల మలచుకపోతే
మీ హృదయాల క్రొత్త వీర్యంతో నింపకపోతే
ఆత గౌరవంతో తల ఎత్తకపోతే
పుట్టక మునుపే చస్తేనే మంచిది"
అని ఎంతో ఆక్రోశముతో
అంబేద్కర్ విలపించాడు.
యాభైయేళ్ళ క్రింద
తరుణ వయస్సు దినాలలో
ఆక్రోశము ఆగ్రహము

మరింత దృఢపడ్డాయి
వయస్సు ముదిరే కొద్దీ
అనేక రూపాల్లో అవతారాల్లో
ఆవేశం ప్రకటించాడు,
కడకు విసుగున నిరాశతో
హిందూ ధరా న్ని వదలి
నవబౌద్ధ ధరా న్ని స్వీకరించమని
అనుయాయుల కోరాడు.
తాత్కాలిక ఆవేశంలో అన్న మాటలు కావు
పిరికిపందయై పలికిన పలుకులు కావు
ఎత్తులకు పైఎత్తుల వేసే మాటలు కావు
అనుభవపరుడై విజ్ఞాన లియై
సాహసంగా తోడిసోదరులకు
చేసిన బోధ అది. వీరమంత్రబీజమది
పెద్దచదువులు చదివాడు
దేశాలతిరిగాడు పుస్తకాల రచించాడు
దేశమేధావులలో ఒకడని పేరు బడశాడు
రాజ్యాంగ శాసనకర్తగ ప్రఖ్యా తిపొందాడు
మరి చస్తేనే మంచిదని ఎందుకన్నాడు?

## 2

అది ఈ నాటి కథ కాదు
మహావీర బుద్ధుల ముందు నుండి వచ్చేకథే
సహస్రాబ్దాల ఆయువుతో పుట్టిన శాపము
అనేకులు మహామనీషులు
ఎదిరించారు ప్రతిఘటించారు
కాని మొన్నమొన్న వరకు
అస్పృశ్యత ధర భాగంగ శాస్త్రసమ్మతంగ
ప్రభుత్వ ఉపేక్షతో సజీవంగ వుండింది
ఊరికి దూరంగ అంటరాని వారుగ

బావి నీళ్ళు తోడుకొనే అర్హతలేని వారుగ
కొన్ని బాటల్లో నడవరాని వారుగా
వీపుమీద బట్ట వుండరాని వారుగ
చెప్పులు వేయకూడని వారుగ
బడుల్లో సమాన పంక్తిలో కూర్చోని వారుగ
దేవాలయాలకు పోకూడని వారుగ
నీచంగ సంఘానికి దూరంగ
చూడరాని వారుగ బ్రతుకుచు వచ్చారు.
మానవుడికి మానవుడికి మధ్య
విభేదపు గోడల మానవులే కట్టారు
జన చేతనే హెచ్చుతగ్గుల నిరి ంచారు
గుణగణముల పాటించక సంఘాన్ని చీల్చారు
ఎన్ని కులాలో ఎన్ని శాఖోపశాఖలో
లెక్కింపులేని సంఖ్యలో చేశారు
ఇదంతా శాస్త్రమని ఆచారమని
ధిక్కరిస్తే నరకమని నూరిపోశారు

హరిజనులు తాత ముత్తాతల నుండి
తరగని అవమానాన్ని
దారిద్ర్య వారసత్వాన్ని
అవిద్యను అనారోగ్యాన్ని అనుభవించారు
అదే మహాసంపదగ
కొడుకులకు మనమళ్ళకు అందిచ్చారు
అందుకనే ఘోషించాడు అంబేద్కర్
"అంటరాని వాడుగ జీవించే బదులు
చస్తేనే మేలు, గౌరవంగా చస్తేనే మెరుగు"
కాని చావడం పిరికిపందల పని
సాహసంగ భావితరాలకు ముక్తిగ
పనిచెయడం సంఘశృంఖలాలను

త్రెంచివేయడం సమాన హోదాతో మానవుడుగ
బ్రతకడం కష్టమైన పని
చావడంకన్న తేలికైన పని వేరే లేదు
స్థితిని గుర్తించి వున్నత స్థితికి
రావడం వీరుని లక్షణం
"వీరులా పిరికి పందలా తేల్చుకొనండి
వీరులై నిలవండి ముక్తికి పోరు సల్పండి
పిరికివారైతే తలవంచి నిస్సహాయతకు
బలి అవండి. తరతరాల కళంకం
అంతటితో తీరుతుంది
కొడుకులుండరు, అంటరానితనముండదు
అవమానముండదు.
భీరువుల స్వర్గాన్ని అలంకరించండి!"

నూతన జాగృతికి వైతాళిక గీతమది
నవచైతనా నికి వీరాహ్వానమది
మానస దౌర్బల్యానికి చికిత్స కావాలె
శతాబ్దాల మత్తుమందుకు విరుగుడు కావాలె
''ఆత శక్తి తెలియని జడులుగనున్నారు.
సంఖ్యాశక్తితో రాజ్యాన్ని చేపట్టిండి
కుంభకర్ణుడు కూడ నిద్రలేచి పోరు సల్పాడు
చిరకుంభకర్ణులై నిద్రపోతూ వుంటారా?"
వేల ఏడుల గ్రహణానికి విడుపు లేదా
దుర్దినాలు అంతమై సూర్యకాంతి కాన్పించదా
చీకటి దొంతరలను ఛేదించే కిరణఖడ్గము లేదా
అంటూ సముద్రమువలె ఉద్ఘోషించాడు
పంచముల ముక్తికై పంచాననమై గర్జించాడు
పిడుగువలె రాపిడి చేశాడు
భావిదిగంతాల మెరుపై మెరిశాడు.

## 5

గాంధిజీ నిరా ఐ కార కలాపాలు
హరిజనోద్ధరణకై ఉపవాసాలు, దేశభ్రమణాలు
విద్యాసౌకర్యాలు వసతిగృహాలు
శాస్త్రాలకు క్రొత్త వ్యాఖ్యానాలు
అస్పృశ్యత జీవిస్తే హిందూధర ము నశిస్తుంది
అనే ప్రచారము స్వాతంత్ర సమరభాగంగా
ఉద్బోధిస్తూ అగ్రవర్ణాల హృదయ పరివర్తన
చేస్తూవచ్చాడు హరిజనులని పిలిచాడు
అంబేద్కర్ దళితశోషిత వర్గాల
ఆశావాణిగ నిలిచాడు
హిందూమతమును అనుసరిస్తూ
శివుని విష్ణువుని కొలుస్తుండినా
దేవాలయ ప్రవేశం లేని అభాగు లకు
ఆలయ ప్రవేశం కల్గిస్తూ చట్టాలు చేశారు
అస్పృశ్యత పాటించిన శిక్షార్హులన్నారు
గాంధీ ప్రేమపూరిత ప్రచారాలు
అంబేద్కరుని ఆగ్రహభరిత ఉత్తేజ భాషణాలు
ప్రయోజన ఓటింగు అధికారాలు
చట్టసభల ప్రత్యేకస్థానాలు
ఉన్నత విద్యా సౌకర్యాలు వసతిగృహాలు
నూతన జాగృతిని కల్గించాయి
మేల్కొన్నారు శతాబ్దాల నిద్రమత్తుల నుండి
నిలబడ్డారు యుగాల సంఘశృంఖలాలను వదలి
అస్పృశ్యత చస్తూ వున్నది, కాని ఇంకా చావలేదు
చావడానికి దశాబ్దాలు పడుతుంది
మజ్జాగతమై రక్తమిశ్రితమై
పీడిస్తున్న ఆచారాలు సంప్రదాయాలు
అంత తేలికగా చస్తాయా

శాస్త్రాల ప్రాపుతో ధర్మం దైవం పేరుతో
అనాదిగ వస్తుండిన నమ్మకాలు ఊరకనే చావవు
మొండి ఆయుస్సు, చచ్చి మరలా లేస్తూవుంటాయి
అప్పుడప్పుడు సంస్కర్తలు చాలామంది
గ్రుడ్డినమ్మకాల తలబ్రద్దలు చేశారు
చాలామంది తిరుగుబడి ఇతర మతాలలో చేరారు.
కాని అస్పృశ్యతా పిశాచము చావలేదు.
ప్రజాస్వామ్యపు సూర్యోదయములో
సర్వజన రాజకీయ అధికారాలలో
హేతువాదయుగంలో విజ్ఞానకాలములో
మూఢాచారతమస్సులు విచ్ఛిన్నమగుతాయి
మానవతకు బలహీనత కల్గించే విశ్వాసాలు నశిస్తాయి

సర్వజన సమానత్వం రావాలే
అదే సర్వోదయం, అంత్యోదయం
అదే సంపూర్ణ విప్లవం.

నెల్లూరు, 6-5-78.

# మే స్మృతులు

వృద్ధాప్యపు పర్వతము మీద కూర్చొని
సంధ్యాకాంతులలో నడిచొచ్చిన బాటను చూస్తుంటే
కొంత వింతగానే వుంటుంది
చిన్న గతుకులు మిట్టలు కాన్పించవు
చాలవరకు అస్పష్టంగానే వుంటుంది
కొన్ని అర్ధస్ఫుటంగా దూరదిగంత మూర్తులవలె
మసక మసకలుగా కాన్పిస్తాయి
కొన్ని వాడిగా సూదులవలె గుచ్చుకుంటాయి
విషాదఘటనలు స్మృతి కంటకాలుగ మారాయి
ఆనంద గర్వకారణాలు మనో వీధిలో
స రణ తోరణ మాలలుగ నవనవ లాడుచునుంటాయి
దాటివచ్చిన బాట జ్ఞాపకాల ఇరుకు సందుగ
తిరుగపోరాని త్రోవగ తయారైంది
ఇటీవలనే స్థూలంగ వా స్తవంగ వుండిన విషయాలు
స ృతి రాజ్యంలో గబ్బిళాలవలె తిరుగుచు నుంటాయి
తోలు బొమ ల నీడలవలె గంతులేస్తూ వుంటాయి
దిగ్వధువుల నీలాంబరాల చెరగుల మాటున కాన్పించని
గాలి పటాల చేతి దారమువలె వుంటాయి
కొన్ని పెద్ద సంఘటనలు సంవత్సరాన్నో
మాసాన్నో తేదీనో పెనవేసుక వుంటాయి
లతావృత వృక్షరాజాలవలె
పందొమి ది వందల నలభై ఏడనగానే
స్వరాజ ం వచ్చిన ఏడని జ్ఞప్తికి వస్తుంది
చైత్ర శుద్ధ నవమి వైశాఖ పూర్ణిమలు
రాముని బుద్ధుని జన దినాలని స్ఫురణకు వస్తాయి
ఇవి సామూహిక సంస రణలు
ఇంకా కొన్ని వ్యక్తిగత జ్ఞాపకాలు
పుట్టిన రోజు వివాహపు దినము

తండ్రి మరణించిన దినము
భూతకాలము విగతజీవనము
స్మృతి విస్మృతి మనో వీధులు
తిరిగి పొందలేని అనుభూతులే
పునః ప్రవేశము లేని కాల దుర్గాలే.

## 2

మే మాసం అనగానే వేసవి మండుటెండలు
భరణి కృత్తిక రోహిణి కార్తుల అనల హారతులు
తోడనే ధగధగ మంటూ జ్ఞప్తికి వస్తాయి
నా మట్టుకు నాకు మే అనగానే
కవీంద్ర రవీంద్రుడు జ్ఞాపకాని కొస్తాడు
ఆ విశ్వకవి కవి గురువు జన్మించింది మే మాసంలోనే
భారతీయ భాషా వియత్తలమున ఉదయించిన ఉజ్వల
తార
ప్రాచ్య ప్రతీచీ సాహితీ సమ్మేళనమై వెలసిన గంగాధార
పురాతన అధునాతన సారస్వతవైఖరుల మేళవించిన
ప్రజ్ఞాశాలి
ఔపనిషిదిక ఋషి సాంప్రదాయాల వారసుడై
అద్యతన కవికోకిల కూజితాలతో శృతి కలిపినవాడు
సర్వ కళా ప్రపూర్ణుడై కళా దేవతల
గారాబు పట్టిగ పేరు పొందినవాడు
సాహిత మున దొడ్డ, సంగీతమున మిన్నయై
సౌందర్య పూజారిగ వెలసినవాడు
ప్రకృతి రామణీయ కతను మానవ భావ
విపుల సంచారాలను చిత్రించిన కళా తపస్వి
శాంతి నికేతన ( నికేతనాల స్థాపకుడై
విశ్వభారతి విశ్వజనీన సౌభ్రాతృత్వాని
పంచి పెట్టిన మహా మానవుడు
విభిన్న సాహిత్య గుణ సంపన్నుని గురుదేవుని
జన ము ఎండల ఏలు బడుల నెలలోనే

జవహర్ నెహ్రూ దివంగతులైనది ఈ నెలలోనే
విశ్వ వేదికపై భారతవాణిగ నినదించిన ప్రజ్ఞావంతుడు
జాతీయతకు అంతర్జాతీయ దృక్కోణాన్ని
అతికించిన రాజకీయ చతురుడు
నిత దేశ భ్రమణాలలో అశేష జన నయనాలలో
దైన్యాన్ని వీక్షించి దాని నిరూ లనకై
కలలు కన్న నిర్మాణ శిల్పి
అసువుల పొందిన అధునికతా మూర్తియై
వైజ్ఞానిక ప్రాసాద ప్రాంగణములోకి
భారతాన్ని ప్రవేశపెట్టిన భవిష్యత్ ద్రష్ట
విశ్వ శాంతికై అవిరామ కృషి సల్పిన విశ్వప్రేమికుడు
పురోగమన పథములో దేశ నిరా ణ దృష్టితో
యోజనా సోపానాల నిరి ంచిన కార్య శూరుడు
సామ్యవాదమే దేశానికి శ్రీరామ రక్షయని
ఘోషించి నవ చైతన్యాన్ని సృష్టించిన ప్రజానేత
జనసందోహాల సర్వోన్నత సమాకర్తయై
ప్రజా తంత్రవాదియై ఉత్సాహాన్ని నన లెత్తించే
వసంతావతార మూర్తియై వెలసిన చిరస రణీయుడు
విశ్వ పాలకులు సమావేశమై
చితాగ్నులలో కాయము భస మగుచుండ
శ్రద్ధాంజలి ఘటించి
అశ్రు అక్షరాలతో స్తవముల లిఖించి జోహార్లిడినారు
జవహర్ సమున్నత లలాటములో
దేశమే సమున్నత శిరస్కయైనది
కవిశ్రేష్ఠుని జననము లోకనాయకుని మరణము
మే మాస నయనాలు తిలకించాయి.

దేశదాస్య విమోచన సమరములో

* నాతొలి శిక్ష మూడవ శిక్ష
మే మాసపు వేడి ఊర్పుల కాలము లోనే
అది స్వప్న యుగం
ఆదర్శ మారుతాలే వాతావరణాన్ని నింపాయి
దేశ విముక్తికై కష్టాల వరించే ఉద్యమాలు
అహింసా సత్య సూత్రాల సత్యాగ్రహాలు
ఉప్పు చట్టాన్ని వ్యతిరేకించే గాంధి దండియాత్రలు
వన వాసాల కేగు రాముడు అయోధ్యను
వీడే దృశ్యాలకన్న రసవత్తర ఘట్టాలు
దండియాత్ర అడుగడుగున
దేశము వీరదుంధుభియై మ్రోగింది
ఎన్ని సముద్రతీరాల ఉప్పు సేతలు, ఏలాలు
మమ్ము మము జైలుకు కొంపొండని
ఉత్సాహపడే శాంతి సైనికులు
ఏ దేశయుగ చరిత్రలోను కాంచని త్యాగోత్సవాలు
ఎందరు స్త్రీలు యువకులు పదవుల వదలినవారు
రాట్నాలు వడి వారు, ఖద్దరు అమే వారు
కల్లు పాకల పికిటెంగు చేసే వీర మహిళలు
వేలమంది వీరసైనికులలో నేనూ ఒకడను
అదేనా సర్వోత్కృష్ట ఆనంద గర్వకారణము
నా జీవితానికి మకుటాయమైన సాహసాధ్యాయము

## 5

మరికొన్ని సొంత విషయాలు మే నెలలోనే జరిగాయి
నా వివాహం రవీంద్ర జయంతి నాడే
మరే ఏ శుభముహూర్తం చూడకనే జరిగింది
స్వాతంత్ర్యయోధులు, నాయకులైన
బారిష్టర్ ఉన్నవల క్ష్మ నారాయణ

---

* నా తొలిశిక్ష 26-5-1930—ఉప్పు సత్యాగ్రహము
మూడవ శిక్ష 26-5-1932 న

మిత్రులు అమెరికాలో చదివిన మాగంటి బాపినీడు
పౌరోహిత్యం వహించారు తెలుగు మాటలు పలికారు
జననానికి మరణానికి ముహూర్తాలు లేవు
వివాహానికి మాత్రము యెందుకు చూస్తారో
కవులందరు ఆశీర్వదించారు
మద్రాసు మంత్రిగానే పెండ్లిపీటలమీద కూర్చున్నాను
విశ్వ వ్యాపిత రవీంద్ర శతజయంతి ఉత్సవాలలో
మా కడపటి కొడుకు పుట్టాడు
యమునాతీరపు ఇంద్రప్రస్థములో
రవీంద్రానందని పేరిడినాము.

నా ఉద్యోగపర్వ అంత్య ఆశ్వాసముగ
ఉత్తర ప్రదేశ [illegible]పాల పదవీస్వీకారము చేశాను
[illegible]మే మాసస్య ప్రథమ దివసమున
దేశానికి గుండెవంటిది ఉత్తర ప్రదేశ్
ఆర్యా వర్తమే అది
హిమాలయాలు వింధ్యా చలాలు
గంగా యమున సరయూ నదులు
అయోధ్య మథుర హస్తినాపురాలు
కా[illegible] ఆగ్రా అలహాబాదు లక్నో పట్టణాలు
వెలసిన ప్రాంతమే అది
వాల్మీకి వ్యాస మహర్షులు
కబీరు తులసీదాసులు
జనిచ్చిన తపోభూమి
నెహ్రూ మాలవ్య నరేంద్ర దేవుల
కర్మభూమి అది
ముముక్షువులకు స్వర్గసోపానములమరిన ధామం
జనాభా వెనుకబడిన తనం వేధిస్తున్నా
ఉత్సాహవంతమైన రాజ్యమది

*ఐదుగురు ముఖ్యమంత్రులు నాహయాములో మారారు
నూట తొంభైనాలుగు మంత్రులు చేత
పదవీ ప్రమాణం చేయించాను
ఏడాది కాలము సలహాదారులు లేకనే
ప్రెసిడెంటు పాలన నిర్వహించాను
తొమ్మిది విశ్వ విద్యాలయాల కులాధిపతిగ
వ్యవహరించాను
అరువది రెండు మాసాలు లక్నోలో ఉండి
రాజకీయాలకు సలాంపెట్టి
మంగా ఇల్లు చేరాను.

సొంత కవితల ప్రారంభించింది
డెభ్భైఏడు మే మాసంలోనే
గణాల మాత్రల సంగీతపు సా[illegible]ం లేకుండ
అంత్య ప్రాసాల వినోదాలు లేకుం[illegible]
నిషేధాల పాటింపక స్వేచ్ఛగ సాగింది కవిత
వచన కవిత్వమే అనుకోండి
భావానికి ప్రాధాన్యమిచ్చి స్వేచ్ఛగ వ్రాయడమే
వచనములో కవితా బీజాలు నాటి నన వెత్తించడమే
నా ఉద్దేశ్యము ప్రయత్నము
అణగియుండిన కవిత
సాహసించి ముందుకు వచ్చింది
భావాల విహంగము అక్షరాల్లోకి దిగింది
ఇంతకాలము ఎక్కడ దాగి వుండిందో
మొత్తానికి రసవత్తర ఘట్టాలే
బయట ఎండలు వడగాడ్పులు
లోపల తల స్మృతి ధారలు
రమ మైన సాంత్వన సమీరాలు.

నెల్లూరు, 6-6-78

---

*శ్రీ చరణసింగ్ శ్రీ చంద్రభానుగుప్త శ్రీ చరణసింగ్
శ్రీ త్రిభువన నారాయణసింగ్ శ్రీ కమలాపతి త్రిపాఠి